శ్రీరస్తు

# శకునశాస్త్రము

శిఖినరసింహాశతకము.



చెన్నపురి

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1937.

*All Rights Reserved.*

శ్రీరస్తు.

# శకునశాస్త్రము

## శిఖినరసింహాశతకము.



క. శ్రీయును శుభమును విభవము
నాయువు నారోగ్యమును మహాయశమును మే
ధాయుక్తభాగ్యమును సు
శ్రేయముఁ గృపసేయుమయ్య శిఖినరసింహా. 1

క. వెలయఁగ సర్వదిగంతము
లలరఁగ సామ్రాజ్యయుక్త మైనయశశ్శ్రీ
లలనావర! కరుణామృత
చెలువము దయసేయు మాకు శిఖినరసింహా. 2

అవ. గ్రంథకర్త అహోబలగిరియందుండు శిఖినరసింహస్వామి పేరట శకునశాస్త్రవిశేషములఁ దెలుపునట్టి గ్రంథము నొకదానిని రచింపఁబూని ఆశిఖినరసింహస్వామిని ప్రార్థించుచున్నాఁడు:—సంపదలు, ఐశ్వర్యము, ఆయువు, ఆరోగ్యము మున్నగునవియు, నలుదిక్కులందు వ్యాపించినకీర్తి మున్నగునవి

కలుగఁజేయు మనియు, నీకరుణ మాయందుంచుమనియు నర
సింహస్వామిని ప్రార్థించుచున్నాఁడు:—

క. సిరు లలరినశకునములకు, నెర యోజకు లైన
యశ్వినీదేవతలన్, గురుతరభక్తి నుతింతును, సిరి
వర! వరశుభము లొసఁగు శిఖి... 3

తాత్పర్యము. మంచిశకునములను జనులకు నొడఁగూర్చు
దేవతలు అశ్వినీదేవతలు గావున అట్టి యశ్వినీదేవతలను నేను
కొనియాడుచున్నాను. లక్ష్మీపతివగు ఓశిఖినరసింహస్వామీ!
మాకు శుభములను గలుగఁజేయుఁము.

## శుభశకునములు.

క. పంచమహావాద్యంబులు, మించిన భేరీధ్వను
లును మెరువడిశబ్దం, బంచితశుభవాక్యము లా,సిం
చినశుభశకునము లగు శిఖి... 4

వీణ, మద్దెలమున్నగుపంచవాద్యములు, భేరీధ్వనులు, బాకా
మున్నగువాద్యములధ్వనులు ఇవి శుభశకునములు.

క. ఫలములు కాయలుఁ బువ్వులు, వెలయాండ్రు
ను గన్నెపడుచ విప్రద్వయమున్, తెలుపన్నముఁ బా
యసమును, చెలువగు శుభశకునము లగు శిఖి...5

ప్రయాణసమయమునందు పండ్లు, కాయలు, పూలు, వేశ్య-
లు, కన్నెపడుచులు, ఇద్దఱు బ్రాహ్మణులు, తెల్లని యన్నము,
పాయసము ఇవి శుభశకునములు.

క. ఏనుఁగు గుఱ్ఱముఁ బీనుఁగు, మానుగ బసవే

శ్వరుండు మఱిఁ బా ల్పెరుఁగుఁ, సేనయు జ్వలించు
నగ్నియు,శ్రీనాథా ! శుభము లగును శిఖి,.. 6

మఱియు-ఏనుఁగు, గుఱ్ఱము, శవము, వృషభము, పాలు, పెరుఁగు, సైన్యము, మండుచుండెడి యగ్ని ఇవియు శుభ శకునములు.

క. నిండినకడవలు రెండును, మెండగుచేఁపలును
గల్లుమించినకావి, ళ్లండనె గాజులసెట్టియుఁ, జెండు
నమఱిదోషములను శిఖి... 7

జలసంపూర్ణకలశములు, మత్స్యములు, కల్లుకావళ్లు, గాజుల సెట్టియు ఇవి శుభశకునములు. సకలదోషములను పోగొట్టును.

## అపశకునములు.

క. పోవద్దన బోసేయన, నే వచ్చెద నన్న నేడ
కేగెద వన్నన్, దోవం గని చెఱఁ గొడసిన, జీవము
లకు హానియండ్రు శిఖి... 8

ప్రయాణమై పోవువారిని, 'పోవద్దు' అని చెప్పినను, 'అన్నము తిని పొ'మ్మని చెప్పినను, 'నేను కూడ వచ్చెదను' అని చెప్పినను, 'ఎక్కడికి పోయెదవు' అని అనినను, పోవుచుండఁగా 'వానిచెఱఁగు పట్టుకొనినను' ఇవి యపశకునములు. ఈయపశకునము జీవహానిని కలుగఁజేయును.

## అశుభశకునములు.

క. ముత్తైనయువతి విధవయుఁ, గట్టెలమో పథ

మకులులుఁగాకులరొదయుఁ, వట్టికలశములు బొగ్గు
లు, జెట్టం గలిగించు నండ్రు శిఖి... 9

ముట్టు అయిన ఆఁడుది, విధవ, కట్టెలమోపు, నీచజాతి వారు, కాకులు కూయుట, వట్టికుండలు, బొగ్గులు ఇవి యప శకునములు.

క. కుందేలు నంబి తంబళి, యందికఁ జనుచుండు
పాము నఱగొఱమదియుఁ, పందులగుం పెదురైనను,
చెందును బయనమున ముప్పు శిఖి... 10

కుందేలు, నంబి, తంబళి, దగ్గఱగా పాముపోవుట, మనస్సులో సందేహముకలుగుట, పందులగుంపు ఎదురుపడుట, ఇవియు అపశకునములు.

క. కైనుండుగొడుగు కఱ్ఱయుఁ, బైనుండినయుత్త
రియము పాగా యైనఁ, పైనంబు వేళ ధరఁ బడ,
సేనానష్టంబు కలుగు శిఖి... 11

చేతియందున్న గొడుగుగాని కఱ్ఱగాని క్రిందపడుటయు, తనదేహము మీఁద వేసికొన్న ఉత్తరీయముగాని, తలగుడ్డగాని క్రిందఁబడునెడల చాలకష్టము కలుగును.

క. సమసంఖ్యగాని ద్విజులును, సములగుశూద్రు
లును బోడిసాతానులు జం, గములు కమసాలులెం
దును, చిమిడింతురు జీవములను శిఖి... 12

బేసిసంఖ్యగల బ్రాహ్మణులు, సమసంఖ్యగల శూద్రులు, బోడిసాతానులు, జంగములు, కంసాలులు, వీరు ప్రయాణకాల మునం దెదురైన జీవహాని కలుగును.

క. పెనుపాగయు మొండి ముక్కిడి,విన(గొలగా
నట్టికలత వేకటియరపుల్, పెనుగాలి ధూళియెడ
నెడ(, జినుకుల( బైనంబు తగదు శిఖి... 13

పెద్దపాగ గనంబడినను, మొండివాఁడు, ముక్కులేనివాఁడు, పెద్దజగడము జరుగుచుండుట, పెనుగాలి, దుమారము, చినుకులు ఇవి యపశకునములు.

క. ఇల పట్టుఁబెట్టుతలయును, తలమానెయు
నెట్టు జడల తలవిరితలయుఁ, తెలిసి పయనంబుఁ
బోయిన(, జెలువము నెడ(బొసిచనును శిఖి... 14

తలకు పట్టువేసుకొన్నవాఁడు, తలంటుకొని చమురుతలతో నున్నవాఁడు, ఎట్టని జడలుగలవాఁడు, విరిబోసికొన్న వెంద్రుకలుగలవాఁడు వీర లెదురు అయినసమయమునందు ప్రయాణము చేయువారలు కష్టములకు పాల్పడుదురు.

## ప్రయాణదినములు.

క. విదియాంగారకమున( జని, పదపడి నలచక్ర
వర్తి బహుకష్టపడెఁ, మదమున( బోయిన జను
లకు(, జెదిసినదేహంబు లగును శిఖి... 15

విదియ మంగళవారమునాఁడు నలచక్రవర్తివంటివాఁడే ప్రయాణమొనర్చి మితిలేనికష్టముల ననుభవించెను. కావున, అట్టిదినమునందు ప్రయాణమొనర్చినవారలు క్షీణించిపోవుదురు.

క. బలిచక్రవర్తి యంతటి, బలుఁడే చెడిపోయెఁ
దదియ భార్గవుని దినంబుల మానవు లిల( జెడరా,
చెలువులు పరదేశమునను శిఖి... 16

తదియ శుక్రవారమునాఁడు బలిచక్రవర్తి బయలుదేరి చెడి పోయెను! కావున, అట్టిదినమునందు మనుష్యులు ప్రయాణ మయి పోరాదు.

క. శ్రీరాముఁ డిడుమలం బడె,వారక చవితియు
నునాదివారము గూడన్, నేరక పయనంబై చని,
శ్రీ.రామాయితరు లెంత శిఖ... 17

చవితి ఆదివారమునాఁడు శ్రీరామచంద్రుఁడు ప్రయాణమై పడరాని పాట్లుపడెను. కావున ఆనాఁ డెవరును ప్రయాణము కారాదు.

క. పంచమిగురువారము మే, లెంచకఁ జని యర్జు
నుండు నిలఁ గష్టపడెన్, మంచిదిన మనుచుఁ బోయి
నఁ, జెంచులలోఁ గలుతు రటవి శిఖ... 18

పంచమి గురువారమునాఁడు అర్జునుఁడు బయలుదేరి పెక్కుకష్టములకు లోనాయెను. కావున మంచిదిన మనుతలంపుతో ఆనాఁడు బయలువెడలఁ గూడదు. అటుల బయలుదేరువారు నట్టడవిలో దొంగలపాలవుదురు.

క. శనివారము షష్ఠినిఁ జని, పనివడి రావణుఁడు
జెడెను బంధుసహితుఁడై, మనుజులు చెడు టబ్బు
రమా, చినయోబళగిరివిహార శిఖ... 19

షష్ఠి శనివారమునాఁడు రావణాసురుఁడు ప్రయాణమై బంధుమిత్రాదులతోడ నశించెను. గావున మనుష్యు లానాఁడు బయలుదేరరాదు.

క. ధరస_ప్తమిసోందువారము, దొరయంజని భార్గ
వుండు దోర్బలశ_క్తిన్, సిరిఁబోనాడెను యితరుల,
సిరు లెన్నఁ దృణంబుగాదె శిఖి... 20

స_ప్తమి సోమవారమునాఁడు పరశురాముఁడు బయలు వెడలి బాహుబలమును సంపదను పోఁగొట్టుకొనెను. కావున మనుష్యులు చెడిపోవుట ఒక లెక్కయా? అనఁగా చెడిపోవుదురని యర్థము.

క. అష్టమి గురువారంబునఁ, గష్టంబుల పాలఁబ
డిరి గద పాండవులే, నష్టంబగుపైనంబుల, శ్రేష్ఠం
బని చనఁగఁ దగదు శిఖి... 21

అష్టమి గురువారమునాఁడు పాండవులు బయలుదేరి పెక్కు కష్టములకు పాల్పడిరి. కావున అట్టినాఁడు ప్రయాణము కారాదు. ప్రయాణమొనర్చునెడల కష్టముల ననుభవింతురు.

## చేష్టాశకునములు.

క. శ్రీకరశుభమశుభంబుల, కేకొలఁదిని ప్రశ్న
లోక మేపనులైనన్, గైకొనెదురకుణంబులఁ, జేకొ
నిచూడంగవలయు శిఖి... 22

ప్రశ్నము నడుగుటకు వచ్చెడివారలు చేసెడిచేష్టల ననుసరించిన ఫలములను గుఱించి చెప్పెదను.

క. నే_స్తముగ వచ్చి మనుజులు, మ_స్తకమును
ముట్టిరేని మానితశుభమౌఁ, గ_స్తియగుం దలఁ
గోకిన, సిస్తాఁ గుడిచెవిని ముట్ట శిఖి... 23

క. ఒకకాల నిలిచియుండిన, నకటా పయనంబు
గలుగు నటు పుడకలు బ, ట్టుకవిరిచినఁ జెడుకార్య
ము, చికురములం బట్టఁ జెడును శిఖి... 31

ఒకకాలుచేత నిలుచుండి యున్నయెడల ప్రయాణము
కలుగును. పుల్లలు విరిచినయెడల కార్యహాని యగును. తల
వెండ్రుకలను తాఁకునెడల చెడుపు కలుగును.

క. కోలను నేలను రాచిన, వాలాయము తాటి
త్రాడువడఁకుచు నడుగన్, చాలా కష్టముఁ బడు
దురు, శ్రీలోలా సకలవిధుల శిఖి... 32

మునికోల మున్నగువానిని భూమిమీఁద గీచుచు తాటి
నారను వడకుచు అడుగునెడల చాలకష్టమును పొందెదరు.

క. ఫలకుసుమ సుగంధంబులు, నలవడువీడ్యంబు
క్షార మాజ్యము దధియున్,నిలఁ బసుల వెంటగని
నను, చెలువుగఁ గల్యాణమండ్రు శిఖి... 33

పండ్లు, పూలు, మంచిగంధము, తాంబూలము, ఉప్పు,
నెయ్యి, పెరుఁగు, పేఁడ, వీనినిచూచునెడల శుభము కలుగును.

క. దగ్గుచు నుమియుచు నవ్వుచు, జగ్గుచు సంతో
షమునను జలమంటుచుదా, నగ్గలిక విడెముఁ జేయు
చు, సిగ్గమరఁగ బహుశుభంబు శిఖి... 34

దగ్గుచుగాని, ఉమ్మివేయుచుగాని, నవ్వుచుగాని, సంతుష్టుఁ
డైనగాని, నీళ్లనుతాఁకుచుఁ గాని తాంబూలము వేయుచుఁగాని
అడిగిన చాలమంచిది.

క. చూరుఁ బెండెము వాసము, లారయ చె
య్యూడియడిగి యాకులు జీరఁగ, నారయుఁ జీల్చు
చునడిగిన,శ్రీరమణా శుభము దొరగు శిఖి... 35

చూరు, పెండెము, వాసము వీనిపైన చేతిని ఆనించి అడిగినఁగాని, లేక ఆకులచీల్చుచుఁగాని, నారను చీల్చుచుఁ గాని అడిగెనేని అశుభకరము.

క. భోజనముఁ జేసి వేడుక, రాజసమున శకున
మడుగ రంజిల్లునయా, తేజంబుగఁ గార్యములగు,
శ్రీజాయా నిజములగును శిఖి... 36

భోజనముచేసి ఒయ్యారముతో శకున మడుగునేని కార్య సిద్ధి అగును.

క. చింతించినఁ జింతయగుఁగ, గొంతుఁగ గూర్చు
న్నగీడు గోఁకుఁగుచు నడుగఁగ, పొంతల బహు
శుభ కార్యము, చెంతఁగ యపశకునమంద్రు శిఖి...

చింతతో అడిగిన చింతయగును. గొంతుగూర్చుండి అడిగిన కీడుకలుగును. గోఁకుగుచు అడిగిన త్వరలో శుభము కలుగును. సమీపమునకు వచ్చి అడిగిన నపశకునము.

క. వచ్చినదూత దనకుఁ దా, నచ్చుగ దాపలను
నిలిచి యటుగూర్చుండఁగ, మెచ్చుగ వెలుపలి కరి
గినఁ, జెచ్చెరకార్యంబు నట్టె శిఖి... 38

దూతయై వచ్చినవాఁడు ఎడమవైపున నిలిచి పిదప గూర్చుండి కుడివైపునకుఁ బోయినయెడల కార్యసిద్ధి కలుగును.

## గౌళిపలుకు శకునము.

క. తలఁచుకఁ బ్రార్థనఁజేసెద, వలపలిదిశగౌళి ప
లుకవల నగుశుభముల్, ఇలపయనము కొఱగాదట,
చెలువగు శుభకార్యమంద్రు శిఖి... 39

ఎచ్చటికైనను పోవునపుడు బల్లి ఎడమవైపున పలికిన యెడల సంపద కలుగును. ప్రయాణము వ్యర్థముకాదు. శుభకార్యము కలుగును.

క. దాపలఁ బల్కిన సకలము, నాపద లగుపయ
నములకు నతిశుభ మలరుః, చూపరులకు దృష్టాం
తము, శ్రీపతిపాదంబులాన శిఖి... 40

బల్లి పట్టియపుడు ఎడమవైపున పలికిన యెడల ఆపదకలుగును. ప్రయాణసమయమునందు పలికిన శుభము కలుగును.

క. పురిఁజొచ్చివచ్చునప్పుడు, నరయఁగఁదాపల
నుబల్క నధికఫలంబౌ, వరశుభములుశీఘ్రంబులు,
సిరివరదా నిజము లివ్వి శిఖి... 41

పట్టణమును ప్రవేశించునపుడు ఎడమవైపున బల్లిపలుకు నెడల శుభఫలములు కలుగును. శుభకార్యములు శీఘ్రముగ సిద్ధించును.

క. కుడిదిక్కుపలుకు కార్యం, బెడనెడ నాలస్య
మగును నెదురుగఁ బలుకః, పడగొట్టినటులఁ గార్య
ము, చెడువెనుకను బల్క శుభము శిఖి... 42

కుడివైపుననుండి పలికిన కార్య మాలస్యముగ సిద్ధించును. ఎదురుగ నుండి పలికిన కార్యముచెడిపోవును. వెనుకటినుండి పలికిన శుభము కలుగును.

క. తోరణ గౌళియుఁ బలికిన, నారూఢిగ బంధు
హితప్రియాంగనరాకల్, కోరిన కోరిక లబ్బును,
శ్రీరమణా నిశ్చయంబు శిఖి... 43

బల్లులు రెండుమూఁడు కలసి పలికిన యెడల బంధువులు, స్నేహితులు, ప్రియురాండ్రు వీరువచ్చెదరు. కార్యసిద్ధియగును.

క. ధరపయనము నడువంగా, వరదక్షిణ గౌళి
పలుక వరలునుశుభముల్, నెరయోధుల పెండ్లిండ్లకు,
సిరు లలరఁగఁ బసిడిపంట శిఖి... 44

ప్రయాణమై పోవునపుడు, దక్షిణముగా బల్లి పలికినశుభము కలుగును. శుభకార్యములపుడుపలికిన ధనలాభము కలుగును.

క. ఎనిమిదిదినముల కొక్కటి, యెనిమిదిదిక్కు
లకుజాము లెనిమిదిఫలముల్, విను మొక్కదిక్కు
నకు నగు, చినయోబళగిరివిహార శిఖి... 45

ఒక్కొక దిక్కునందు ఒక్కొకజామునకు వేర్వేఱు ఫలములుగ చెప్పఁబడియున్నది. వివరమును చెప్పుచున్నాఁడను:—

క. భయమునుఁ జింతయు హానియు, క్షయమును
లాభంబు ధనము సంపద శుభముల్, నయముగ నెని
మిదిజాముల, జయమింద్రుని గౌళిఫలము శిఖి...46

తూర్పుదిక్కునందు:—భయము, చింత, హాని, క్షయము, లాభము, ధనము, సంపద, శుభము ఇవి ౮ జాములకు క్రమముగ కలుగును. ఇట్లే,

క. రోదనము రణముభుక్తియు,జూదము వస్త్రంబు ధనము శుభమును జయముర్, పాదుకొను నగ్నిమూలను, శ్రీదయితా నిత్యశుభము శిఖి... 47

ఆగ్నేయదిక్కునందు:—రోదనము, రణము, భుక్తి, జూదము, వస్త్రము, ధనము, శుభము, జయము కలుగును.

క. చుట్టము లాభముఁ గ్రోధము, బెట్టును మరణంబుచింత విందులు శుభముల్, గట్టిగ దక్షిణమరయఁగ, చిట్టాంబళ గిరివిహార శిఖి... 48

దక్షిణపుదిశయందు:— చుట్టములు, లాభము, క్రోధము, కష్టము, మరణము, చింత, విందులు, శుభము ఇవి కలుగును.

క. మరణము సంతోషముశుభ, మరిభయ మశుభంబు హాని యర్థము సిరులుర్, ధరనెనిమిదిజామునకును, స్థిరముగ నైరృతిఫలంబు శిఖి... 49

నైరృతిదిశయందు:—మరణము, సంతోషము, శుభము, శత్రుభయము, అశుభము, హాని, ధనము, సంపద ఇవి కలుగును.

క. ధనమును జుట్టము లాభము, వినుమరణము శుభముఁ జేటు విత్తము సిరులుర్, గనుఁగొనఁబడమటిగాలికి, చినయోబళ గిరివిహార శిఖి... 50

పశ్చిమదిశయందు:—ధనము, చుట్టములు, లాభము, మరణము, శుభము, కీడు, ధనము, సంపద ఇవి కలుగును.

క. మేలును లాభము ధనమును, శ్రీలును వాహ
నము శుభము స్థిరమును జయముర్, వాలాయము
వాయవ్యము, శ్రీలోలా జాముగౌళి శిఖ... 51

వాయవ్యదిశయందు :— మేలు, లాభము, ధనము, సంపద, వాహనము, శుభము, స్థిరము, జయము ఇవి కలుగును.

క. చావును లాభము శుభమును, భావము మే
ల్వార్త సుఖము భయమును జయముర్, యేవెర
వున ధనపతిపై, శ్రీవెలయఁగ జాముగౌళి శిఖ...52

ఉత్తరదిశయందు:—మరణము, లాభము, శుభము, భావము, సువార్త, సుఖము, భయము, జయము ఇవి కలుగును.

క. గండము చిచ్చు సుఖము జయ, మండనె పెం
డ్లిండ్లు లాభ మతివలచేటుర్, ఖండిత మీశాన్యం
బున, చెందును యేదోషమైన శిఖ... 53

ఈశాన్యదిశయందు:— గండము, అగ్నిభయము, సుఖము జయము, వివాహము, లాభము, స్త్రీలకు చెరుపు ఇవి కలుగును.

వాక్యశకునము.

క. ఒకపలుకు దనకు వమ్మగు, వికటం బగు సంధి
రెండు విను జగడము మూఁ, డకటా నాలుగు జగ
డము, సికషట్లౌ సుమ్మి దైదు శిఖ... 54

ఒకటి అనుపదమును వినిన చేటు. రెండుఅనుపదమును విన్న యెడల వికటసంధి. మూఁడు అనుపదమును విన్న కలహము. నాల్గు అనుపదమును విన్న కలహము. ఐదు అనుపదమును విన్న పెద్దకలహము సంభవించును.

క. ఆఱైనను శ్రేయస్కర, మేరీతిని జగడ మేడు
నెనిమిదిమరణం, బారయ ధనశుభ ఫలమగు, శ్రీరమ
ణా తొమ్మిదింట శిఖ... 55

ఆఱు అనుపదమును విన్నయెడల శ్రేయస్కరము. ఏడు ఎనిమిది అనుపదములు విన్న మరణము. తొమ్మిది అనుపదమును విన్నయెడల ధనలాభము.

క. పది సంపద బహుగెలుపగు, పదునొక్కట
చావునిజము పదిరెండై తే, పదుమూఁడుపలుకులై తే
చెదరును తానున్నస్థలము శిఖ... 56

పదిఅనుపదమును విన్నయెడల సంపదలు కలుగును. పదునొకండు అనుపదమును విన్నయెడల జయముకలుగును. పన్నెండు అనుపదమును విన్నయెడల మరణము. పదమూఁడు అనుపదమునువిన్న స్థానభ్రష్టుఁ డగును.

క. మును పాండురాజతనయులు, ననువగు రా
జ్యంబువిడిచి యడవికిఁ జని రొ,య్యనఁ బదమూఁడ
గుపలుకులఁ, జీనయోబళగిరినివాస శిఖ... 57

పదమూఁడు అనుపదమును వినుటచేతనే వెనుక పాండవులు పురిని విడిచి అడవులకుఁ బోయిరి.

క. పదునాల్గుమేలుఁ బదియే, న్వదలక సీతాంగ
నయును వడిచెఱబోయెఁ, పదునాఱిట హనుమం
తుఁడు, చెదరక యయ్యబ్ధిదాఁటె శిఖ... 58

పదునాల్గు అనుపదమును విన్న మేలు. పదియైదు అనుపదమును వినుటచేతనే సీతాదేవి చెఱఁబోయెను. పదియాఱు అను

పదమునువినుటచేత హనుమంతుఁడు సముద్రమును దాఁటెను.

క. శ్రీ.రాముఁడు సీతాశుభ, మారూఢిగ వినిప
దేడు నట దండె త్తెఁ, వారిధిఁ గట్టెను శుభముగ,
శ్రీరమణ దశాష్టకమున శిఖి... 59

పదియేడు అనుపదమునువిని రాముఁడు సీతావృత్తాంతమును
ఎఱింగెను. పదునెనిమిది అనుపదమును విని సేతువును గట్టెను.

క. నవదశకంబున రాముఁడు, జవమున రావణుని
గెలిచె సమరజయుండై, భువి త్రిపురంబుల గెలి
చెను, శివుఁ డిరువదిపలుకు లోదవ శిఖి... 60

పందొమ్మిది అనుపదమువలన రావణాసురుని రాముఁడు
జయించెను. ఇరువదను పదమువలన ఈశ్వరుఁడు త్రిపురా
సురుల జయించెను.

క. ధర గౌళి తుమ్ముశకునము, నరయ నవగ్రహ
ములందు నగుసిజఫలముల్, ధరగౌళి ముష్టివ్రాఁ
తలు, చెరిసగమగుఁ గొంతనిజము శిఖి... 61

తుమ్ముశకునము, గౌళిశకునము మున్నగునవి సగము ఫలిం
చును. సగము ఫలించవు.

### రాహువుండువారములగడియలవివరము.

క. భానునివారము రాహువు, నానుగ రాత్రి
యునుఁ బగలు నరువదిగడియల్, పూనుకొని యుం
డు దిరమున, శ్రీనాథా దక్షిణమున శిఖి... 62

ఆదివారమునాఁడు రాత్రింబగళ్లు ౬౦ గడియలు రాహువు
దక్షిణపుదిశయం దుండును.

క. ఇందునివాసర మఱువది, యందొక మంగళునివార మటుముప్పదియుఁగా, పొందుగఁ దొంబది గడియలు, చెందును నైరృతిని రాహు శిఖ... 63

సోమవారము ౬౦ గడియలు, మంగళవారము పగలు ౩౦ గడియలు మొత్తము ౯౦ గడియలు నైరృతిదిశయందు రాహు వుండును.

క. మంగళుని రాత్రి ముప్పది, మఁంగల బుధవారమందు మునునిరువదిగూ, డంగను నేఁబది వరుఁణుని, చెంగట రాహువు వసించు శిఖ... 64

మంగళవారము రాత్రి ౩౦ గడియలు, బుధవారము ౨౦ గడియలు మొత్తము ౫౦ గడియలు పడమటిదిక్కునందు రాహు వుండును.

క. పోరి నిలిచిన నలువదియును, వరసౌమ్యుని వారమందు వాయవ్యమునఁగా, గురువారము భృగు విరువది, సిరిమగఁడా యుత్తరమున శిఖ... 65

బుధవారమునాఁడు ౨౧ గడియ మొదలు ౬౦-వ గడియ వఱకు మొత్తము ౪౦ గడియలు వాయవ్యదిశయందు రాహు వుండును. గురువారమునాఁడు ౬౦ గడియలు శుక్రవారము ౨౦ గడియలు మొత్తము ౮౦ గడియలు ఉత్తరపుదిశయందు రాహు వుండును.

క. అల భార్గవువారంబున, నలువది స్థిరవారమందు నటుముప్పదియుఁగా, గలశనిడెబ్బదిగడియలు, చెలువుగ నీశాన్యమందు శిఖ... 66

శుక్రవారమునాఁడు ౨౧ గడియ మొదలు ౬౦-వ గడియ వఱకు ౪౦ గడియలు, శనివారమునాఁడు ముప్పది, మొత్తము ౭౦ గడియలు ఈశాన్యదిశయందు రాహువుండును.

క. శనివారము ముప్పదియును, ఘనరాహువు
తూర్పునుండి కదుపడిఁజని యాగ్నేయమున నిల్పి నిలువక
దక్షిణమునదగుఁ దొంటిపగిది శిఖి... 67

శనివారమునాఁడు ౩౧-వ గడియ మొదలు ౬౦-వ గడియ వఱకు ౩౦ గడియలు రాహువు తూర్పునుండి, వెంటనే ఆగ్నేయమునకుఁబోయి అచటనుండి వెంటనే దక్షిణమునకు చేరును.

క. ఇనగురుదినముల మఱితూర్పున దక్షిణమున
కవీందులోలిపడమరఁగ, విను కుజు నుత్తరము న్గది,
సిన బుధశనులందు రాహు శిఖి... 68

సూర్య, గురువారములందు తూర్పుదిక్కునందును, శుక్ర, సోమవారములందు దక్షిణపుదిక్కునందును, మంగళవారము పడమటిదిక్కునందును, బుధశనివారములందు ఉత్తరమునందును రాహువుండును.

## నవగ్రహగౌళి.

క. మానవులతుమ్ము గౌళియు, భానునిపైఁ బల్కె
నేని బహులంపటతాఁ, బూనినపని కానేరదు, శ్రీ
నాథా నిశ్చయంబు శిఖి... 69

గౌళి సూర్యుని పైపడినను తుమ్మినను తలంచినపని కానేరదు.

క. చుట్టములు వత్తు రెప్పుడుఁ, బట్టిన కార్యంబు
జయము బహుశుభ మలరుఁగ, గట్టిగఁ జంద్రుని ఫల
మిది, చిట్టాబళగిరివిహార శిఖి... 70

చంద్రునిపై పల్లినను తుమ్మినను బంధువులరాక, కార్య జయము కలుగును.

క. భూపుత్రునిపైఁ బల్లిన, నాపదలకు మూల
మగుచు నలగుట జాడ్యం, బేపట్టునఁ గలహంబగుఁ,
జేపట్టదు ఫలమొకింత శిఖి... 71

అంగారకునిపై పల్లినను తుమ్మినను ఆపదలు, కలహము కలుగును.

క. వరసౌమ్యునిపైఁ బల్లిన, నరులకు శుభఫల
ములెపుడు నయముగ వెలయుఁగా, సరిలేనిసౌఖ్య
మమరును, సిరివరదా శుభములివియు శిఖి... 72

బుధునిపై పల్లినను తుమ్మినను శుభప్రదము. సకలసౌఖ్య ప్రదము.

క. సురగురుపైఁ బల్లినచో, నిరతము ధనధాన్య
వస్త్రనిచయము కలుగుఁగా, ధరణీశుల మన్నన లగు,
సిరివరదా సౌఖ్యమొసఁగు శిఖి... 73

బృహస్పతిపై పల్లినను తుమ్మినను ధనధాన్యవస్త్రలాభము, రాజసన్మానము కల్గును.

క. మృష్టాన్నంబును ద్రవ్యము,నిష్టంబగు ఫలము
సౌఖ్య మెప్పుడుఁ గలుగుఁగా, పుష్టంబుగ శుక్రునిపై,
సృష్టీశా శుభకరంబు శిఖి... 74

శుక్రునిపైఁ బల్లినను తుమ్మినను, మృష్టాన్నలాభము, సౌఖ్యము కలుగును.

క. శనిపైఁ బల్లినఁ దుమ్మిన, ఘనమగు రోగం

బుఁ జింత కష్టము లెప్పుడుఁగ్, బెనఁగొని వడిఁ బీడిం
చును, చినయోబళ గిరివిహార శిఖి... 75

శనిపైఁ బల్కినను తుమ్మినను విచారము, కష్టము కలుగును.

క. మరణముఁ జోరభయంబును, ధరణీశులచేత
బాధతముఁ డై రోగం, బరయఁగ నగ్నిభయంబును,
సిరిమగఁడా రాహుఫలము శిఖి... 76

రాహువుపై పలికినను తుమ్మినను మరణము, చోరభయము,
రాజబాధ, రోగములు గలుగును.

క. కేతువుఫల మిదె భూమికి, నేతీరునఁ దప్పి
గ్రామ మిల నెడబాపుఁగ్, భూతలము దిరిగి వెతఁ
బడు, సీతాపతి సాక్షిగాను శిఖి... 77

కేతువుపైఁ బల్కినను తుమ్మినను స్వగ్రామమును విడిచి
దేశమంతయును తిరిగితిరిగి పేసారును.

## తుమ్ములశకునము.

క. రెండుగఁ దుమ్మిన సఫలము, ఖండితముగఁ
దుమ్మిచీదఁగా మరణ మగుఁగ్, మొండుగఁ దుమ్ముచు
నడచిన, జెండును దోషములు నరుల శిఖి... 78

రెండుతుమ్ములు తుమ్మిన కార్యము సిద్ధించును. తుమ్మి చీదిన
యెడల మరణ మగును. నడుచుచు తుమ్మిన దోషములను పోఁ
గొట్టును.

క. తుమ్ముచుఁ దగ్గుచు నడిచిన,నెమ్మది శయనించి
యుమియ నిజమగుబహురో, గమ్ములఁ బాయని
జడిగా, జిమ్మును తుమ్ములఫలంబు శిఖి... 79

తుమ్ముచు దగ్గుచు నడిచినను, పరుండి ఉమ్మి వేసినను అనేక వ్యాధులు కలుగును.

క. లేచిన మొసలిం జూచిన, జూచిన బంగారుఫల
ము తరుణుల నటనన్, జూచిన వీడ్యముం జేసిన, శ్రీ
చతురా తుమ్ముఫలము శిఖి... 80

మొసలిని బంగారును పండ్లను స్త్రీలనాట్యమును చూచినను, తాంబూలము వేసికొనినను తుమ్మువలనిదోషము పోవును.

క. ఇలఁగోకినఁ గడకేగినఁ, దలగోకినఁ జింతనేయ
దడఁబడఁ జీదన్, బలుకష్టము తుమ్మినతటి, శిలలై నం
గష్టపడును శిఖి... 81

తుమ్ముచు భూమిగోకికొన్నను, అవతలకుఁ బోయినను, తల గోకికొనినను, చింతగానున్నను, తడఁబడినను, చీదినను పెక్కుకష్టముల నందును.

క లేచిన శుభమగుఁ దమ్ముచుఁ, గూర్చుండిన
నీళ్లకడను గొణుగుచు నుండన్, నాచుక జగడముఁ
జేసిన, శ్రీచతురా కార్యహాని శిఖి... 82

లేచుచు తుమ్మిన శుభప్రదము. కూర్చుండి తుమ్మినను, నీటిదగ్గఱనుండి తుమ్మినను, గొణుగుచు తుమ్మినను, కలహించుచు తుమ్మినను కార్యహాని యగును.

క. ఇనుమును వెండియు ముట్టిన, గనుఁగొనఁ
జెడుఁ గార్యమెల్లఁ గంచును తామ్రమ్మును జయము
తుమ్ముచును హెచ్చిన నది నంటగ శుభంబు శిఖి
నరసింహా. 83

ఇనుమును వెండిని తాఁకినను చూచినను కార్యము చెడును. కంచును, రాగిని తాఁకినను చూచినను జయము. తుమ్మి పై వానిని తాఁకిన శుభము కలుగును.

క. పసిబాల శిశువు లంజెయు, పసగల బాలింత
తుమ్ము బంగారుసుమీ, వెస మాల కుంటి తుత మెన,
సిన బహుకార్యములసిద్ధి శిఖ... 84

పసిబిడ్డ, బోగముది, బాలింత, వీరుతుమ్మిన మంచిది. మాల వాఁడు, కుంటివాఁడు, వీరుతుమ్మిన కార్యసిద్ధి గలుగును.

క. తొత్తును గర్భిణి గొడ్డును, ముత్తైదువు విధవ
గుడ్డిముండల తుమ్ముల్, గుత్తగ మరణాంతము నీ,
చిత్తము దయసేయుమయ్య శిఖ... 85

లంజె, గర్భిణిస్త్రీ, గొడ్రాలు, ముత్తైదువు, విధవ, గుడ్డివారు వీరితుమ్ములు మరణమును కలుగఁజేయును.

క. చాకిత గాండ్లది చిప్పెది, మూకది నెలుకలది
మొండి ముక్కిడివారల్, యేకడఁ దుమ్మిన దుఃఖమె,
చేకూడదదు ఫలమొకింత శిఖ... 86

చాకలిది, గాండ్లది, కుట్రపుది, మూగది, ఎలుకలది, మొండిది, ముక్కిడిది మున్నగుజాతిస్త్రీలు తుమ్మిన దుఃఖముకలుగును.

క. నాలుగుపదముల జీవము, లాలోచనలపుడుఁ
బయనమౌనెడఁ దుమ్మఁగ, వాలాయము మరణాం
తము, శ్రీలోలా తప్పదండ్రు శిఖ... 87

ఏదేనికార్యము నాలోచించునపుడును, ప్రయాణమై పోవునపుడును తుమ్మిన మరణము కలుగును.

## తొండపాటు ఫలము.

క. ముక్కున వ్యాధినివారణ,మక్కర మృష్టాన్న
భుక్తియగు వక్షముపై, నెక్కిననెడ భూషణములు,
చిక్కును మఱి భుజములందు శిఖ... 88

తొండ ముక్కుమీఁద పడినయెడల వ్యాధి నశించును. వక్షఃస్థలముపైఁ బడిన మృష్టాన్నభోజనము, భుజములపై ప్రాకిన భూషణములు ధరించును.

క. శిరమున భయమగు లక్ష్మి,కరమగు వలనొసలి
మీఁదఁ గడుభూషణముల్,నిరు చెవులఁ గంటదుఃఖ
ము, సిరిమగఁడా! తొండపాటు శిఖ... 89

శిరస్సుమీఁద తొండపడిన భయము, కుడినొసలిమీఁద లక్ష్మీప్రదము, రెండుచెవులమీఁదఁబడిన భూషణప్రాప్తి, కంటి మీఁద పడిన దుఃఖము కలుగును.

క. చేతుల నావుల కాపద, నాతుల చుట్టముల
దర్శనము కడుపుపయిన్,ఖ్యాతిగఁ బిరుదులపైఁ బడ
సీతాపతి లాభ మంద్రు శిఖ... 90

చేతులమీఁద పడిన ఆవులకు చెరుపు, కడుపుమీఁదఁ బడిన స్త్రీలను, చుట్టములును దర్శించును. పిరుదులమీఁదఁ బడిన లాభము కలుగును.

క. తొడలను కాళ్లను రోగం,బెడమకడన్ దేహ
మందు నెపుడు ధనంబున్, కుడిపార్శ్వము ధనహాని
యు, చెడుగలుగును ముఖమునందు శిఖ... 91

తొడలమీఁదను, కాళ్ళమీఁదను తొండపడిన రోగము

కలుఁగును. దేహమునం దెడమవైపునపడిన ధనము లభించును. కుడివైపున పడిన ధనహానికలుగును. ముఖమునందు పడినచెడుగు కలుగును.

క. పాదములసందు లాభము, మేదిని కుడిపాద
మైన మేలగుధనముఁ, ఆదిభయ మెడమపదమున,
శ్రీదయితా పిదప శుభము శిఖినరసింహా. 92

పాదమునమధ్యయందు తొండపడిన లాభము. కుడిపాదమునందు పడిన ధనలాభము. ఎడమపాదమునందు పడిన మొదట భయముకలిగి పిదప శుభము కలుగును.

క. పై కెగఁబ్రాఁకిన శుభమగు, చేకొని క్రిందికిని
దిగిన చేటగునెపుడుఁ, దాకిన చుట్టిన మేలగు, శ్రీకర
మగుతొండపాటు శిఖి... 93

తనదేహముమీఁదికి తొండ ఎగఁబ్రాఁకిన శుభప్రదము. పైనుండి క్రిందికిదిగిన చేటుకలుగును. తాఁకినను చుట్టినను మేలు కలుగును.

## నలికీచుపాటుఫలము.

క. నలికనులపాముసంగను, నలికిరియు ననంగ మ
ఱియు నలికీచనగా, నిలనుండు రక్తపుచ్చిక, చెలగుఁ
నలుమూల లలరి శిఖి... 94

తాత్పర్యము సులభము.

క. పొక్కిలికి దిగుచఁబ్రాకిన, నెక్కినఁ జుట్టినను
పడిన నేఫలమైనఁ, నొక్కి వచింపఁ బ్రమాణము,
చిక్కదు నలికిరిఫలంబు శిఖి... 95

నలికిరిపాము బొడ్డుకు క్రిందిభాగమునందు ప్రాకినను ఎక్కినను, చుట్టినను ఇట్టిఫలము కలుగునని ఏగ్రంథమునందు చెప్పలేదు. కావున ఏమియు నిచట చెప్పలేదు.

క. పొక్కిలికిఁ బైన ముందటి, ప్రక్కన నెచ్చోటు
దిగిన ప్రాఁకిన జయమౌ, నెక్కినఁ దాఁకిన నాకిన, చి
క్కులు గలవండ్రు బుధులు శిఖి... 96

బొడ్డుకుపైనముందరిప్రక్కయెచ్చటనైనను దిగినను ప్రాఁకినను జయమగును. ఎక్కినను, తాఁకినను, నాకినను చిక్కులుగలుగును.

క. వీపుపయిఁ బడిన భాగ్యము, మూపుపయిం బ
డినచో స్వపురమును వీడుఁగా, కాపురము చెడును
తెక్కల, శ్రీపతి నలికీచుపడిన శిఖి... 97

వీపుమీఁద పడిన భాగ్యము. మూపుపైన బడిన తనపురిని వదలి ఇతరప్రదేశమునకు పోవును. తెక్కలమీఁదఁ బడిన తన కాపురము చెడిపోవును.

## బల్లిపాటు తజ్జాతి తత్కాలఫలములు.

క. బల్లులజాతులు తెలియఁగ, తెల్లనియది బ్రహ్మ
జాతితిరమగు నెఱుపౌ, బల్లి యిల రాచజాతిగఁ, జెల్ల
గఁదగు ధరణియందు శిఖి... 98

క. కోమటిగులంపు బల్లికిఁ, జామనచాయయగు
శూద్రజాతికి నలుపౌ, కామించి ఫలము జెప్పఁగ, శ్రీ
మానినిహృద్విహార శిఖి... 99

బ్రహ్మజాతిబల్లి తెల్లఁగానుండును. క్షత్రియజాతిబల్లి ఎఱ్ఱగా

నుండును. కోమటిజాతిబల్లి చామనచాయఁగా నుండును. శూద్రజాతిబల్లి నల్లగా నుండును.

క. గురుశుక్రసోమవారము, లరయఁగ మఱిసత్వ
కాలమగుచుండు ధరన్, పరగఁగ బాపనబల్లికి, చిరు
యోబళగిరివిహార శిఖ... 100

బాపనజాతిబల్లికి గురు, శుక్ర, సోమవారములు సాత్విక కాలము, ఇవి ప్రశస్తములు.

క. భూజరవివాసరంబులు, రాజసకాలంబు గౌళి
రాజాతికినిన్, దేజము శుభమని పెద్దల, చేఁ జెప్పఁ
గఁబడును భువిని శిఖ... 101

రాచజాతిబల్లికి ఆదివారము అంగారకవారము రాజసకాలము శుభమని పెద్దలు చెప్పెదరు.

క. పోలున్ కోమటిబల్లికి, కాలము రాజసము
తెలియఁగా బుధవారం, బేలీల నగును ధారుణి,శ్రీ
లోలకరాళవదన శిఖ... 102

కోమటిజాతిబల్లికి బుధవారము రాజసకాలము శుభమగును.

క. నాలుగవజాతిబల్లికి, కాలము తామసము నర
యగను శనిదినమౌ,వాలాయము శుభకరమగు, శ్రీ
లోలా నిశ్చయముగ శిఖ... 103

శూద్రజాతి బల్లికి శనివారము తామసకాలము శుభకరమగును.

క. ఉదయాదిగఁ బదిగడియలు, పదపడి సాత్విక

ము నవల పదిరజసౌ ము,ప్పదివఱకు తామసంబగుఁ,
జెదరక సతతంబుఁ దెలియ శిఖ... 104

సూర్యోదయాది ౧౦-వ గడియవఱకు సాత్వికకాలము, ౧౧-వ గడియ మొదలు ౨౦-వ గడియవఱకు రాజసకాలము, ౧౨-వ గడియ మొదలు 3౦-వ గడియవఱకు తామసకాలము అని ఎఱుంగవలయును.

క. ఆదినిశి నైదుగడియలు, పాదుకొనుఁ సాత్వి
కంబు పదివరకును నిం,పొదిగ సాత్విక కాలము, శ్రీద
యితా చెలఁగుచుండు శిఖ... 105

క. పదియేను మొదలుగా ని, ర్వదివఱకును తా
మసంబు పదపడి యటు ని, ర్వదియైదు రాజసంబగు,
చెదరఁక సత్వంబుతుదికి శిఖ... 106

రాత్రి ౧ గ. మొదలు ౧౦ గ. వఱకు సాత్వికకాలము, ౧౫ గ. మొదలు ౨౦ గ. వఱకు తామసకాలము, ౨౦ గ. మొదలు ౨౫ గ. వఱకు రాజసకాలము నని గ్రహించునది.

క. ఆయాజాతులగౌళుల, కాయావారములు కా
లమగు నేని నిజం, బాయాఫలములఁ దప్పక, చేయు
నిలఁక బల్లిపాటు శిఖ... 107

ఆయాజాతిబల్లులకు తగినకాలములందును వారములందును ఆయాఫలములు తప్పక సిద్ధించును.

క. తనజాతిబల్లియైనఁ, తన కెక్కువయైనబల్లితన
కగు కాలం, బున తనపైఁ బడ శుభమగు, చినయో
బళగిరివిహార శిఖ... 108

తనజాతిబల్లిగాని లేక తనకంటె ఎక్కువజాతి బల్లిగాని తనకుతగిన కాలమునందు తనపైనఁ బడినయెడల శుభమగును.

క. రమణులకు నెడమవైపు, త్తమములురోమము
లు లేనితావున మఱియు, శ్రమను కుడివైపుపురుషుల,
చెమరకపడనేని శుభము శిఖి... 109

స్త్రీలకు ఎడమవైపునందును, రోమములు లేని తావునందును, పురుషులకు కుడివైపునను బల్లిపడినయెడల శుభమగును.

క. కీడగును మీఁదపడి దిగఁ, గీడుఁ మేలగును
కాని క్రియ వెల్లనగుఁ,చూడఁగపడి యెక్కనివో,
క్ష్వేడగళార్చితపదాబ్జ శిఖి... 110

బల్లి మీఁదపడి క్రిందికి దిగినయెడల కీడు అగును. దేహము మీఁద పడి పైకి ప్రాఁకినయెడల కీడు అయి పిదప మేలగును. కార్యములును నెరవేరును.

క. ఆఱునెలలగును భానుని, వారమునఁ బడిన
సోమవారమునఁ బడఁ, తీరుగ తొమ్మిదిగడియలు,
శ్రీరమణా బల్లిఫలము శిఖి... 111

ఆదివారమునందు బల్లిపాటు జరిగినయెడల తత్ఫలము ఆఱు మాసములలో అగును. సోమవారమునందు తొమ్మిదిదినములలో నగును.

క. ధారుణిసుతువారంబున, నారయ నాదినము
నందె నగుఫలచిన్నెల్,మీఱి బుధవారమునఁ బడఁ,
జేరు న్మాసద్వయముకు శిఖి... 112

మంగళవారము బల్లిపాటు జరిగినయెడల ఆదినమునందే

తత్ఫలము సిద్ధించును. బుధవారమునందైనయెడల ౨ మాసము లలో తత్ఫలము కలుగును.

క. గురువార మొక్క నెలకును, పరగఁగ భృగు
వారమందు పక్షమున కగుర్, ధర శనియందొక యేఁ
డగు, స్థిరగౌళిఫలంబుఁ దెలియ శిఖి... 113

గురువారమునాఁడు ఒకమాసమునకును, శుక్రవారమునాఁడు ౧౫ దినములకును, శనివారమునాఁడు ఒకసంవత్సరమునకును తత్ఫలము కలుగును.

క. జుట్టుకొనఁ బడిన మరణము, పట్టుగఁ బదునాల్గు
నెలలవఱకున్న తిక, న్పొట్టగవలెఁ దాలిమితోఁ, జిట్టా
బళగిరివిహార శిఖి... 114

తలవెండ్రుకలకొనయందు బల్లిపడునెడల మరణము కలుగును. ౧౪ నెలలవఱకు ఈఫలమును నిరీక్షించవలయును.

క. ఏవేళ బల్లిపడునో, యా వెంటనె జలకమాడి
యడలకశుచివై, కోవెలకుం జని దైవము, సేవించినఁ
దొలఁగుఁ గీడు శిఖి... 115

బల్లి తనమీఁదఁ బడినవెంటనే స్నానముచేసి శుచియై దేవాలయమునకుఁ బోయి స్వామిని సేవించినయెడల దానివలన కలిగెడి కీడుపోవును.

క. పరిణయ ముపనయనంబులు, జరుగని పసివారి
పైన సరిబల్లిపడర్, గురికొని తల్లికిఁ దండ్రికి, స్థిరముగ
నాఫలము లబ్బు శిఖి... 116

పెండ్లిగాని కన్నెపడుచులమీఁదను, వడుగుగాని బాలుర

మీఁదను బల్లి పడినయెడల ఆబల్లిపాటువలన కలిగెడుఫలము వారితల్లిదండ్రులకు కలుగును.

క. నడినెత్తిన రోగము కుడి, పెడతల భ్రాతలకు
హాని పెడతలనడుమన్, బడ గౌళిపాటు తమ్ములు,
చెడిపోవుట సత్యమండ్రు శిఖి... 117

నడి నెత్తియందు బల్లి పడినయెడల రోగము కలుగును. కుడికణతయందు సోదరులకు కీడు. కణతనడుమయందు పడిన యెడల తమ్ములు చెడిపోవుదురు.

క. తన మేనమామకగండము, వినుతలఁబడ ముంద
లయును విత్తము గీడున్, కొనవెండ్రుకలనుమరణము,
చినయోబళగిరివిహార శిఖి... 118

తలమీఁదఁ బడినయెడల మేనమామకు చెరుపు. తలకు ముందుభాగమునందు (మాడునందు) ధనహాని. వెండ్రుకల కొన యందు మరణము నని యర్థము.

క. నొసలం బడ వాసింగను, పసగల బంధువుల
రాక బహుశుభ మగురా, జసభల మన్ననయగు
వా, సిసుమీ యీగపులిపాటు శిఖి... 119

ఈగపులి నొసటిమీఁద పడినయెడల వాసి కలుగును. బంధువులు వత్తురు. రాజసభలందు మర్యాద కలుగును.

క. వలపలి గండస్థలమున, లలనల కపజయము
పురుషులకు శుభమగు దా, పలి గండస్థలమున బడ,
చెలులకును శుభం బటండ్రు శిఖి... 120

కుడిచెక్కిళ్లయందు బల్లిపడినయెడల స్త్రీలకు అపజయము

కలుగును. పురుషులకు శుభకరము. ఎడమచెక్కిలియందు పడిన యెడల స్త్రీలకు శుభకరము.

క. తలముసుకుపైనఁబడ మేల్గలుగదుపురుషులకు
సతికి గండముతలఁపఁగ,బలు కీలుగంటుపైఁబడ, చెలి
యగు బాసికము లబ్బు శిఖ... 121

పురుషులకు తలపైనవేసుకొన్న ముసుకుమీఁదఁ బల్లిపడిన యెడల మంచిదిగాదు. స్త్రీలకుమాత్రము గండము కలుగును. స్త్రీలకు కీలుగంటుమీఁదఁ బడినయెడల శుభకరము.

క. కుడికంటఁ బీడగలుగును, కడునబ్బును సంప
దలును కడుమే లెడమఁగ, కడునబ్బు రోగమబ్బును,
చెడువ్యాధియు నాసికమున శిఖ... 122

కుడికంటిమీఁదఁ బడినయెడల పీడకలుగును. ఎడమకంట సంపదకలుగును. ముక్కుమీఁద పడినయెడల రోగము కలుగును.

క. కన బ్రహ్మరంధ్రమునకును, వెనుకను లక్ష్మీక
రంబు వివరింపఁగ ము, చ్చెన గుంటబల్లిపడినను,
చెనకును తమ్ములకు కీడు శిఖ... 123

బ్రహ్మరంధ్రమునకు వెనుకభాగమునందుఁ బల్లిపడినయెడల లక్ష్మీకరము. ముచ్చనగుంటయందు పడినయెడల కీడుకలుగును.

క. భువిబ్రహ్మరంధ్రమున మృత్యువుపాపటలోన
తల్లితోఁబుట్టునకుఁగ, దవులును బలుకష్టంబులు, శివ
దేవార్చితపదాబ్జ శిఖ... 124

బ్రహ్మరంధ్రమునందు మృత్యువు. పాపటయందు పడిన యెడల తల్లితోఁబుట్టువులకు చెరుపు కలుగును.

క. పరికింప హానియగా ముం,గురులను జుట్టు
పయిఁబడిన గురుకష్టంబౌ, వరునకు గండము జడపై,
చిరతరయశ గౌళిపాటు శిఖ... 125

స్త్రీలకు ముంగురులపైనఁగాని వెండ్రుకలమీఁదఁగాని బల్లి పడినయెడల కష్టము లధికముగఁ గలుగును. జడయందు పడిన యెడల భర్తకు కీడుగలుగును.

క. కొనముక్కునఁ బీడయగున్, జనహానియు
నడుమ శుభము జనుపురుషులకున్, ధన మెనయు
నొసట సతికిన్, జనయోంబళగిరివిహార శిఖ... 126

ముక్కుకొనయందు బల్లిపడినయెడల హానికలుగును. ముక్కుయొక్క నడుమునందు మధ్యభాగమునందు పడినయెడల శుభముకలుగదు. స్త్రీలకు నొసటియందు పడినయెడల ధనలాభము కలుగును.

క. కుడికంటను గుడిచెవిపయి, కడులాభం బెడ
మదిక్కు కంటను చెవిపైఁ, బడ హాని యెడమచెం
పను, చెడు పురుషుఁడు స్త్రీకి మేలు శిఖ... 127

కుడికంటియందును కుడిచెవియందును లాభము. ఎడమదిక్కు కంటను చెవిపైనియందును హానికలుగును. పురుషునకు ఎడమ చెంపయందు కీడగును. స్త్రీకి మేలగును.

క. చెంపయుఁ గనుబొమవలపల, సంపద దాపలను
కీడు సరికనుబొమలా, లింప సభాపతికృపర,క్షింపును
కనుబొమల నడుమ శిఖ... 128

క. మీసము సవ్యం బొప్పదు, వాసిగ నపసవ్య

మందు వనరుగఁబడినఁ, మీసములనడుమఁబడినను,
చేసును ధనలాభ మెందు శిఖ... 129

ఎడమమీసము మీఁదనైనను కుడిమీసము మీఁదనైనను మీసముల మధ్యభాగమందైనను బల్లి పడినయెడల ధనలాభము కలుగును.

క. తేజముపై పెదవిని మఱి, భోజన మమృతంబు
నొసఁగు భువివాతెరపై, రాజభయం బగుగడ్డము,
శ్రీజయ నిశ్చయఫలంబు శిఖ... 130

పైపెదవియందు బల్లి పడినయెడల తేజస్సుకలుగును. క్రింది పెదవిమీఁద పడిన మంచిభోజనము లభించును. గడ్డమునందు రాజభయము కలుగును.

క. నాలుకపైఁబడినను విద్యాలాభముపండ్లపైన
నగుభూనష్టం, బాలాగ కురుల చెఱఁబడు, త్ర్యోళ
ధరానల్పతల్ప శిఖ... 131

నాలుకపై బల్లిపడినయెడల విద్యాలాభము కలుగును. పండ్ల పైన పడిన భూమినష్టమగును. వెండ్రుకలందు పడినయెడల చెర సాలలో పడును.

క. చెక్కిటఁ గుడిదెస భోగము, చిక్కుదురట
వ్యాధి నెడమచెక్కిట భాగ్యం, బెక్కువ గొంతున
మెడపైఁ, జిక్కును సంతానఫలము శిఖ... 132

కుడిచెక్కిలియందు బల్లి పడినయెడల భోగము, ఎడమ చెక్కిలియందు వ్యాధికలుగును. గొంతుమీఁద పడినయెడల భాగ్యము, మెడపైని పడినయెడల సంతానముకలుగును.

క. అందలము లెడమ మెడపై, సందడి శత్రుక్ష
యంబు సవ్యపు గంఠం, బం దెడమభుజము రోగము,
చెందును కుడిభుజము జయము శిఖి... 133

మెడపైని ఎడమవైపున బల్లిపడినయెడల పల్లకినెక్కును. సందిడ పడునెడల శత్రుక్షయము కలుగును. కంఠమునకు ఎడమవైపున బల్లిపడినయెడల బంధనముకలుగును. ఎడమభుజమందుపడినయెడల రోగమునుచెందును. కుడిభుజమునందు పడినయెడల జయముకలుగును.

క. గొంతెముకపైన భయమగు, వింతగ చంక
పయిఁ బడిన ప్రేతభయంబౌ, పంతముగ వెన్నుపయిఁ
బడ, చింతింపఁగ శత్రుభయము శిఖి... 134

గొంతెముకమీఁదఁ బల్లిపడినయెడల భయముకలుగును. చంకపైఁ బడినయెడల ప్రేతభయమగును. వెన్నుపైఁ బడినయెడల శత్రుభయము కలుగును.

క. వళులందునఁ దోఁబుట్టుల, కలసట నపసవ్య
బాహువట స్త్రీభోగం,బులు బొడ్డునడుమఁబీడయు,
చెలువుగ నురమునను శుభము శిఖి... 135

పొట్టపై నున్న వళులందుఁ (ముడుతలందు) బల్లిపడినయెడల తోడబుట్టువులకు కష్టములు కలుగును. ఎడమబాహువునందుఁ బడిన స్త్రీసంభోగము కలుగును. బొడ్డునకు నడుమ పీడకలుగును. ఉరమునందుపడిన శుభము కలుగును.

క. దాపలిచంటను సంతతి, యేపునఁ గుడిచంట
బట్టలప్పుడు గలుగుఁ, గాపురము భాగ్య మబ్బును,
శ్రీపతిచను మొనలయందు శిఖి... 136

ఎడమ స్తనమునందుఁ బల్లి పడినయెడల సంతానము కలుగును. కుడి స్తనమునందు పడినయెడల వస్త్రములు లభించును. చను మొనలందుఁ బల్లి పడినయెడల భాగ్యవంతుఁడగును.

క. వెన్నెముక పిశాచభయం, బెన్నఁగఁ గటి
వస్త్రలాభ మెంతయు కలుగున్, పన్నుగఁ ద్రికమునఁ
బడినను, చెన్నగు హయలాభ మండ్రు శిఖి... 137

వెన్నెముకయందుఁ బల్లిపడినయెడల పిశాచభయము కలుగును. కటిస్థలమునందు పడినయెడల వస్త్రలాభము కలుగును. మూపురమునందు పడినయెడల అశ్వలాభము కలుగును.

క. పొట్టపయిఁ బడిన భాగ్యము, పుట్టును కడు
కష్ట మెపుడు పొక్కిటఁ బడినన్, గట్టిగ సిరిబో!
కడుపున, చిట్టాబళగిరివిహార శిఖి... 138

పొట్టపయిన బల్లి పడినయెడల భాగ్యముగలుగును. పొక్కిలి యందు పడినయెడల కష్టములుకలుగును. కడుపుమీఁదఁ బడిన యెడల సంపదకలుగును.

క. మోచేతిపయిన లోపల, యోచన దుఃఖంబు
కుడిని యుక్తం బెడమన్, మోచేతిపైన లోపల,
శ్రీచతురాయెడమకడను శిఖి... 139

మోచేతిపైన బల్లిపడినయెడల యోచనము కలుగును.

క. సిరు లెడమమూరచెయిపయి, నరుదగు కుడి
మూరచేత నష్టముమణిక, ట్లెరుగడమీ చెయిదాపల,
సిరులలరును లాభ మెపుడు శిఖి... 140

ఎడమమూరచేతిమీఁద బల్లి పడినయెడల సంపదకలుగును.

కుడిమూరచేతియందు పడినయెడల నష్టముకలఁగును. మంజేతి కిరుపార్శ్వములందును మీఁజేతికి ఎడమవైపునందును సంపదలు కలుగును.

క. వలపలమీఁచెయి పయిఁ బడ, నలరుర్ శత్రు
క్షయంబు నరిచేత శుభం,బులు కరతలమునఁ బడఁ
గా, చెలువుగ బలుసిరులుగలుగు శిఖి... 141

కుడిచేతిపైని బల్లి పడినయెడల శత్రుక్షయముకలుగును. అర చేతియందు పడినయెడల శుభముకలుగును.

క. ఎడమయరచేత నిడుములు, కడుఁగష్టము వ్రే
ళ్లమీఁదఁ గడులాభ మగుర్, కుడివ్రేళ్లనడుమ
గోళ్లను, చిడిముడి కుడిగోళ్లఁబడిన శిఖి... 142

ఎడమ అరచేతియందు బల్లి పడినయెడల కష్టముగలుగును. వ్రేళ్లమీఁద పడినయెడల అధికకష్టము కలుగును. కుడివ్రేళ్ల యొక్క నడుమభాగమునందు ఎడమచేతిగోళ్లయందు లాభము కలుగును. కుడిచేతిగోళ్లయందు చిక్కులుకలుగును.

క. బరినెముకలఁ గుడినడుమన, ధరఁ దనతోఁ
బుట్టులన్నదమ్ములకీడుర్, బరిప్రక్కఁ దల్లితండ్రికిఁ,
జిరగండము లవితలంప శిఖి... 143

ప్రక్కటెముకలందును నడుమునకు కుడివైపునందును తన సోదరులకు చెరుపుకలుగును. ప్రక్కభాగమునందు తలిదండ్రులకు గండము.

క. ప్రక్కలిరుగడల భోజన, మక్కట స్త్రీభోగ
మబ్బు నటుగర్భమునర్, మక్కువ నడిమధ్యంబునఁ,
జిక్కనఁ గార్యంబుసేయు శిఖి... 144

రెండు ప్రక్కలందు పడినయెడల భోజనము లభించును. గర్భములందు పడినయెడల స్త్రీభోగముకలుగును. మధ్యమునందు పడినయెడల కార్యసిద్ధి.

క. పిఱుఁదునపసవ్యమునసుఖ, మరయఁగ వలపి
ఱుఁదుమీఁద యటలింగముపయి,సిరు లుల్లసిల్లు బీజ
ము,చెరుచును మరణాంతమగును శిఖి... 145

కుడిపిఱ్ఱయందు సుఖముకలుగును.

క. ఆసనమున మేల్కుడితొడ, నీసున మగబిడ్డ
సచ్చు నెంతయు పిఱుఁదన్, వాసియు లోతొడలు
భయము, జేసును లాభం బటంద్రు శిఖి... 146

ఆసనమునందు బల్లి పడినయెడల మేలు కలుగును. కుడితొడ యందు పుత్రనష్టము ప్రాప్తించును.

క. తొడవెనుకను విషభయమగు,తొడముందట
భోగసుఖము నొరఁగొను మఱిలో,తొడపయిఁ బరస
తిగమనము, చెడుఁగేమియు లేదు తలఁప శిఖి...147

తొడలకు వెనుకభాగమునందు పడినయెడల విషభయము కలుగును. తొడలకు ముందుభాగమునందు సుఖముకలుగును. తొడలందు పడినయెడల పరస్త్రీగమనము కలుగును.

క. బలనాశము గజ్జలలో,పలఁ దగ దాంపత్యహాని
పౌరుషముకొనన్, వెలయున్ గాళీపతనము, చెలఁగు
ననుచుఁ దెలియవలయు శిఖి... 148

గజ్జలందు పడినయెడల బలమునశించును. లింగాగ్రమునందు పడినయెడల దాంపత్యతకు చెరుపగును.

క. అండముల క్రింద చౌర్యం, బండములపయిఁ
స్వదేశత్యాగము మోకాల్, దండిగ వాహనలాభ
ము, చెండుఁ దోషములనెల్ల శిఖి... 149

బీజములకు క్రిందఁ బల్లిపడినయెడల చౌర్యము కలుగును. అండములకు మీఁద స్వదేశత్యాగము. మోకాలియందు వాహన లాభము. కలుగును.

క. మోకాళ్లఁగీడువలపల, గైకొను శుభ మెడమ
వట్టికాళ్లను నెడమఁ, చీకాకుపఱుచు వలపలఁ, జే
కొనసౌఖ్యంబు లొసఁగు శిఖి... 150

కుడిమోకాలియందు పడినయెడల కీడు. ఎడమమోకాలి యందు శుభము. ఎడమకాలియందు కష్టపడును. కుడికాలియం దుపడిన సుఖముకలుగును. కుడిపిక్కయందు మేలు. ఎడమపిక్క యందు అశుభము. రెండుమడిమలందు రెండురెట్టలయందు శుభ ము కలుగును. రెండుమీఁగాళ్లయందు జయము కలుగును.

క. పిక్క కుడి మేలు నడుమను, నొక్కెడ నశుభం
బుమడిమ లొప్పగు రెట్టల్, పెక్కుభయంబులు ను
భయము, చిక్కను మీఁగాళ్ల జయము శిఖి... 151

క. లోగిరిగ నెడమఁగష్టము, బాగున వెలిగిరగ
నడుమ బంధనముకుడిఁ, రోగము లోగిరిగయు బ
హు, శ్రీగలుగును వెలిగిరిగను శిఖి... 152

క. కుడిపదము వ్రేళ్లధనమగు, గడుపీడయు
గోళ్లమీఁద కలహము నడుమఁ, బడగోళ్లను యా
వ్రేళ్లను, చెడిపోయినధనమువచ్చు శిఖి... 153

కుడికాలివ్రేళ్ళయందుఁ బల్లిపడిన యెడల ధనలాభమగును. గోళ్లమీఁదఁ బడినయెడల కలహము. గోళ్లకు నడుమభాగము నందు పడినయెడల నష్టమై పోయినధనము మరల లభించును.

క. పదమడుగున పైనం బగు, బదిలంపు ధనం
బు నెడమపద మడుగుననో, పదములఁ బైనము లా
భముఁ, జెదరకఁ దనుఁజూచు శుభము శిఖి... 154

అరకాలియందుఁ బల్లిపడిన ప్రయాణము కలుగును. ఎడమ అరకాలియందు ధనము. పాదములందు పడినయెడల లాభము కలుగును.

క. సోకిన భయమగు బల్లియు, ప్రాకటముగ నె
దురుఁజూడ భాగ్యము లొసఁగుఁ, జేకొను శుభ
మశుభంబులు, శ్రీకరమగు గౌళిఫలము శిఖి...155

బల్లితాకినయెడల భయము కలుగును. ఎదురుగాచూచునెడల భాగ్యము కలుగును.

క. పాదపుసంధుల రోగము, పాదుకొనుఁ మ
డిమవెనుకఁబడు చెఱసాలఁ, మోదము చెడు రో
మంబుల, శ్రీదయితా బల్లిపాటు శిఖి... 156

పాదములయొక్క సంధియందు రోగము. మడిమలకు వెనుక భాగమునందైన కారాగారప్రాప్తి. రోమములందు పడినయెడల సంతోషము నశించును.

క. తలనుండి దిగిన హానియు, నిలపదముల నుండి
పైకినెక్కిన జయమౌ, తల గౌళి దిగిన శుభమును,
చెలువుగఁ బైకెక్క శుభము శిఖి... 157

తలనుండి క్రిందికి దిగినయెడల హాని, పాదములనుండి పైకె క్కిన జయముకలుగును. తలనుండిదిగినయెడలను తలనుండియే పైకెక్కినయెడల శుభము కలుగును.

క. ఇల నివి సితపక్షఫలం, బులు బహుళమునం
దున ఫలములు విపరీతం, బులుగను బొసంగుచుం
డును, చెలువుగ నిలలోన నెపుడు శిఖి... 158

ఈబల్లిపాటును గూర్చి పైపద్యములందు చెప్పిన ఫలములన్నియు శుక్లపక్షమును గుఱించి చెప్పియున్నాము. కృష్ణపక్షమునం దీఫలములు విపరీతముగా గ్రహించవలయును.

క. ధర షష్ఠ్యష్టమి నమవస, భరణియు మఖ
పూర్వభాద్ర భంబుల నినభూ,ధరణీజుని వారంబుల,
స్థిరమగు విపరీతఫలము శిఖి... 159

షష్ఠి, అష్టమి, అమావాస్య తిథులందును, భరణియు మఖ పూర్వాభాద్రానక్షత్రములందును శని, ఆదివారములందును పైనిం జెప్పిన ఫలములకు విపరీతఫలము కలుగును.

సర్పదర్శనశకునము.

క. ఉరగము కురగపు జగడము, ధరకలహము
గలుగు నద్భుతంబులు పుట్టుఁగా, చెరు చొకటి బాఱ
భూపతి, సిరిచెడి తాఁకెడు నిజంబు శిఖి... 160

రెండుపాములు కలహము చేయుచుండఁగా జూచినయెడల పోట్లాట కలుగును. అద్భుతములు పుట్టును. పారిపోవు చుండఁగాఁ జూచినయెడల సంపదలు నశించును.

క. చచ్చినపామును గనుఁగొనఁ,జచ్చినవార్తయు
ను బుట్టు సత్యము గూడఁగా, నచ్చుగ సతిపతి గనుఁ

గొన, చెచ్చెర బహుశుభము గలుగు శిఖి... 161

చచ్చినపామును చూచినయెడల చచ్చినవార్తను వినును. రెండుపాములు కలసి సంభోగించునపుడు జూచినయెడల శుభములు కలుగును.

క. చెట్టుదిగుపాముఁజూచిన, పట్టపు రాజులకుపీడ ఫల మల్పులకుఁ, చెట్టెక్కుదొరకుశుభములు, చిట్టా బళగిరివిహార శిఖి... 162

చెట్టునుండి దిగుపామును గొప్పగొప్పరాజులు చూచిరేని వారికి దారిద్ర్యము కలుగును. దరిద్రులు చూచినయెడల సంపదలు కలుగును. చెట్టెక్కునపుడు సంపదలు కలుగును.

క. ఉరగ మిలుఁజేర ధనపతి,దరిద్రుఁడౌ బేదవాఁడు ధనపతియగు పా, మురువడి నిలువెళఁ బాఱిన, సిరి చెడు నుభయులకు ధరను శిఖి... 163

పాము తనఇంటిలోనికి పోవుచుండఁగా చూచునెడల దరిద్రుఁడు శ్రీమంతుఁడగును, శ్రీమంతుఁడు దరిద్రుఁడగును. ఇంటినుండి బైటికిఁ బాఱిపోవునపుడు చూచినయెడల ఉభయులకు సంపదలు నశించును.

క. పామరుగుజాడగనినపు, డేమరకను వెనుక కడుగుఁ బెట్టుచుఁ జనియా, పామడుగుఁ గాలఁ దుడిచియు, శ్రీమెరయుఁ బ్రయాణమయిన శిఖి... 164

పాముపోయిన బాటయొక్క గుర్తు కనంబడగనే వెనుకకు అడుగుపెట్టుచు పోయి ఆపాము పోయినజాడను కాలితో తుడిచి ప్రయాణముచేసిన శుభము కలుగును.

క. ఎడమ దెసనుండి తోఁకయుఁ, బడిగెత్తుచు

కుడికిఁ జనినబహుశుభమగు నా, పడిగెత్తినమృష్టా
న్నము, చెడులేకను కలుగుచుండు శిఖి... 165

ఎడమవైపుననుండి తోఁకను పడిగెను ఎత్తి కుడివైపునకు పోఁగా శుభము కలుగును. ఒకపడిగెమాత్రము ఎత్తిపోయిన యెడల మృష్టాన్నము లభించును.

క. తెరవునఁ జెదరక నుండిన,స్థిరశుభమాఁదోలఁ
గనేని జెడుసిరి కుడినుం, దురగము నడుమను గనుఁ
గొన, సిరిచెడి రోగములఁబడును శిఖి... 166

దారిలో పాము కనంబడి బెదరి పాఱిపోక నిలిచియుండిన యెడల శుభమగును.

క. వలపలిదెస సర్పమురా, ఫలమగుఁ దలఁచిన
తలంపు పడిగాడించక, ఇలనేలు నట్టి దొరయగు,
చెలువగు శుభశకునమంద్రు శిఖి... 167

కుడివైపునుండి సర్పమువచ్చినయెడల తలచినతలంపులు కలుగును. తన్నుచూచి పడగ ఆడించినయెడల సంపదలు కలుగును.

క. ఎడమదెస పాముఁగనుఁగొని, నడచినఁ జెడు
తిరిగి చనిన నయముగ మూర్ఖం, బడరుచుఁ బోయిన
నరుఁ డిలఁ, జెడిపోవుట సిద్ధమంద్రు శిఖి... 168

తనకు ఎడమవైపున పామును జూచుచు నడిచినయెడల కార్యముచెడును. ఆప్రయాణమును మానవలయును. పామరచుచు పోయినయెడల ప్రయాణమొనర్చిన చెడిపోవును.

క. నడిదారినున్న పాముటు, కడుపును పైఁజేసి
పొరలఁగాఁగని నూరా, మడద్రైనఁదిరుగ మేలగుఁ,

జెడుకల్గును తిరుగకున్న శిఖి,... 169

మార్గమధ్యమందున్న పాము కడుపును పైగాఁజేసి పొరలఁగా చూచినవాఁడా ప్రయాణమును తప్పక మానవలయును. కొంత మార్గము నడిచిఉన్నను మానుట మంచిది. లేనియెడల తప్పక చెరుపు కలుగును.

క. కనినప్పుడె పడిగెత్తిన, ఘనముగఁ బ్రతుకుదురు శుభము కల్యాణమగుర్, ధనపతులగుదురు పేదలు, చినయోబళగిరివిహార శిఖి... 170

తనుచూచి పడిగెనెత్తి ఆడుచుపామున్నయెడల శుభములు కలుగును. సంపదలు కలుగును.

క. పుట్టపయి సర్ప మెక్కిన, పట్టుగ ధన మబ్బు జయము బహు పేదలకుర్, గట్టిగఁజెడుసంపన్నుఁడు, చిట్టౌబళగిరివిహార శిఖి... 171

పాముపుట్టపైకి నెక్కుచుండఁగాఁ జూచునేని దరిద్రుఁడు, ధనికుఁడగును. ధనికుఁడు దరిద్రుఁ డగును.

క. చేనుమడి తోఁటనుండియు, నానఁగ పడిగెత్తి యాడ నాఫల మలరుర్, వానిఁ గని పాఱవాఁడా, చేని ఫలముఁ దినఁగ లేఁడు శిఖి... 172

పంటకాపు మడిదగ్గ ఱకుఁగాని తోఁటదగ్గఱకుగాని పోయినపుడు అచట పాముండి పడగవిప్పుకొని యాడునెడల ఆచేను తోట చాలగ ఫలించును. ఆపాము తానువచ్చినపుడు తనను చూచి తోఁటనుండిగాని చేనునుండిఁగాని పారిపోయినయెడల ఆచేనియందుఁగాని తోఁటయందుఁగాని పండినపంటను వాఁడను భవింపఁడు.

క. విత్తవము రిత్తపోయిన, సత్తుగపడిగె త్తియూ
డుసర్పముఁ గనినఁ, మొత్తముగఁబండు ధాన్యము,
చిత్తము రంజిల్లఁజేయు శిఖి... 173

తాత్పర్యము సులభము.

క. పురిమొగసాలను సర్పము, చొరఁబడుటను
గాంచెనేని శుభము తొలంగుఁ, పరికింపఁ జనిన
కార్యము, స్థిరముగ నాపదలఁ జేయు శిఖి... 174

పట్నపు మొగసాలయందు పాము ప్రవేశించుచుండఁగా చూచునెడల శుభముతొలఁగును. అచటనుండి పాము వెలుపలికి పోవుచుండఁగా చూచినను ఆపదల కలుగఁజేయును.

క. పాము నొకపాము మ్రింగిన, నామహాపడి
ప్రజలుసతిసుతాదులును గ్రగ్రామణ్యముఁజేసిన ధర,
క్షేమంబులు తప్పి చెడును శిఖి... 175

పామును ఇంకొక పాము మ్రింగుచుండఁగా చూచినయెడల క్షేమకరముకాదు.

క. పురమును జొర మొగసాలను, యురగధ్వని
కుడినిమేలు నొప్పగు శుభముఁ, దరిదప్పి యెడమ
వినఁ జెడు, చిరుబుస్సలు వినినవాఁడు శిఖి... 176

పట్నమును ప్రవేశించునపుడు మొగసాలయందు కుడివైపున పామయొక్క-బుసను విన్నయెడల శుభము కలుగును. ఎడమ వైపున వినినయెడల చెరుపుగలుగును.

క. ఉరగధ్వనివిని పురమునఁ, జొరవచ్చును వెలు
పలైనచో మొగసాలఁ, నెరపైనముః బో రాదట,సిరి

మగఁడాయడుగెఁడ్డైన శిఖి... 177

బయటనుండి వచ్చెడివాఁడు పాముకూత విని పట్నము లోనికి రావచ్చునుగాని ప్రయాణమై ఇతరత్ర పోవువాఁడు మాత్రము ప్రయాణమును మానుకొనవలయును.

క. పామునుపామనశుభమగు, పామటపడిగెత్తఁ
జూడ బహుశుభమగునా,పాము తనుఁజూడఁ గనుఁ
గొన, జీమూతపుగష్ట మగును శిఖి... 178

ప్రయాణమగునపుడు ఎవ్వరేని పాముపామని అరచినను లేక ఆపాము తనను పడగ నెత్తియుండఁగ తాను చూచినను శుభముకలుగును. ఆపాము తనను చూచిన యెడల ప్రయాణ కాలమునందు కష్టములు కలుగును.

క. వలపలిదెస సర్పము గన, తలనెత్తినఁ జుట్టఁబ
డినఁదగపచ్చనిచెట్టులనెక్కినసామ్రాజ్యము, జిలువల
దొర శుభము నొసఁగు శిఖి... 179

తనకు కుడివైపున సర్పము చూచినను, ఆసర్పము తలనెత్తినను లేక పాము చుట్టచుట్టుకొని యున్నను, పచ్చనిచెట్టుపై నెక్కినను మంచిఫలములు కలుగును.

## పిల్లిశకునము.

క. శకునములఁ జూడవలసిన, సకలక్రియలందుఁ
బిల్లి శకునంబులజూ, డక చేసినఁజెడుకార్యము,చికి
లీకత్తి నఱుకగును శిఖి... 180

ప్రయాణసమయమునందు పిల్లియొక్క శకునము చూచుటయు అత్యావశ్యకము. లేనియెడల కార్యములు చెడిపోవును.

క. అడ్డముగ పిల్లివచ్చిన, నడ్డగు కార్యంబులెల్ల

నపసవ్యముగా, బిడ్డవలె చుట్టుఁదిరిగిన, చెడ్డగు
కార్యంబులెల్ల శిఖి... 181

తనకు అడ్డముగా పిల్లి వచ్చినయెడల కార్యములన్నియు చెడి పోవును.అపసవ్యముగాపిల్లితనచుట్టుతిరిగినను కార్యహానియగును.

క. చనుచుఁ బ్రదక్షిణముగఁ జు, ట్టినఁగొంచెపుఁ
జెఱుపు కలుగు ఢీకొని కాట్లా, డిన కలహం బొన
గూడును, చినయోబళగిరివిహార శిఖి... 182

ప్రదక్షిణముగ పిల్లి తనచుట్టు తిరిగినయెడల స్వల్పనష్టము కలుగును. పిల్లులు పోట్లాడుచున్నయెడల కలహము కలుగును.

క. మూషకమును కరుచుక సం, తోషంబున
నెదురుపడిన తోడనె శత్రుల్, శోషించి యోడిపో
దురు, శేషఫణీశ్వరశయాన శిఖి... 183

పిల్లి ఎలుకను నోటఁ గఱచుకొని సంతోషముతో నెదురుగా వచ్చినయెడల శత్రువులు నశించిపోదురు.

క. ఘోరుపనులందు నడుమను, దూరిన నాపనులు
జెడును తోడనె నాయా, కార్యములు నిలుపవల
యును, క్షీరసరిత్పతిశయాన శిఖి... 184

పిల్లి ఏదైనా పని జేయుచుండఁగా మధ్యలో దూరపడిపోయి నయెడల ఆపనులు చెడును. కావున ఆయాకార్యములను ఆప వలయును.

క. ఓతువు మైథునమును కన, చేతికివచ్చెడుధనం
బుచేరదుస్త్రీపుం, జాతులపిలుపులువినఁబడ, చేతము
చెడుపయన మొదవు శిఖి... 185

పిల్లి సంభోగించునపుడు చూచిన ధననష్టము కలుగును. ఆడ పిల్లి మొగపిల్లి పీనియరపు వినినయెడల మనఃక్లేశము, ప్రయాణము కలుగును.

క. మోరఁ గడిగినబంధులు, కోరిక జనుదెంత్రు మఱియుఁ గుక్కలభీతిఁ, పేరెంబిడ నరిభీతియు, చేరఁ బయనంబునందు శిఖి... 186

పిల్లి తనమూతిని నీళ్లలో కడుగుకొను నెడల బంధువులు వత్తురు. కుక్కలను చూచి పారిపోయినయెడల శత్రుభయము కలుగును.

క. ఎలుకలకు వెరచిపారిన, కలుగుఁ విఘ్నము లకడ్డుకనిననిసుగులఁ, బిలుచుకవచ్చినవిఘ్నము, శిల శాసన మగుచునుండు శిఖి... 187

పిల్లి ఎలుకలకు భయంపడి పారిపోవునెడల విఘ్నములు నశించును. తన పిల్లలను తీసుకొనివచ్చినయెడల విఘ్నములు కలుగును.

క. శిలితబయనం బగునపు, డాలయపుంగుమ్మమందు నటనెదు రైనఁ, వాలాయ మింటఁ బెరిఁగిన, చీలికిదోషంబులేదు శిఖి... 188

పెంపుడుపిల్లి ప్రయాణసమయమునందు వాకిలిముందఱ కనంబడునేని దోషము లేదు.

క. పిల్లల నోటం గరుచుక, వెళ్లిన స్థలచలన మగును పిల్లి భయమునఁ, మెల్లఁగ దాగుట గన విల, సిల్లును కార్యసఫలంబు శిఖి... 189

పిల్లి తనపిల్లలను నోటకరుచుకొని పోవునెడల స్థానభ్రష్ట

మగును. తనను చూచి భయంపడి దాగుకొను నెడల కార్యము సిద్ధించును.

క. ఆరోగ్యము కక్కినచో, ప్రేరిమి మలమూత్ర
ములను విడిచినరోగం, బారూఢి సంభవించును,
క్షీరసరిత్పతిశయాన శిఖి... 190

పిల్లి కక్కుచుండఁగా చూచునెడల ఆరోగ్యము కలఁగును. మలమూత్రములను విడుచునెడల రోగము కలుగును.

కుక్కలశకునము.

క. కుక్క కుడికాల దనకుడి, ప్రక్కన్ యేయం
గమైన బరుకుచువెళ్లన్, గ్రక్కున గనపయనంబుల,
చిక్కును లాభంబు జయము శిఖి... 191

కుక్క కుడికాలితో తనకుడివైపున ఏయంగమునుగాని బరుకుచుపోయినయెడల ప్రయాణకాలమునందు లాభము కలుగును.

క. మఱియు నమేధ్యంబైనను, బురదైనను బూసి
కొని చెవులు జాడించన్, ధరపయనంబులఁ జూచిన,
స్థిరముగ మృత్యుభయ మగును శిఖి... 192

కుక్క అమేధ్యమునుగాని బురదనుగాని బూసికొని చెవులు జాడించుచుఁ గనంబడునెడల మృత్యుభయము కలుగును.

క. గ్రామాధిపతింటిమొగన్, సీమముతో నుద
యమందు నిత్యము కుక్కల్, బొమనుచు మొరగ
బదిలై, సీమన్నెడఁ బాసిపోవు శిఖి... 193

ఉదయకాలమునందు కుక్కలు గ్రామాధికారి యింటివైపు మొగముపెట్టి నిత్యము అరచుచుండినయెడల ఆదేశమును వదలి పోవును.

క. గ్రామపుటాగ్నేయదిశను, దీమసమున రెండు మూఁడుదినములు భానుఁగాఁ, ఆముకొని చూచి మొరిగిన, సీమఁగ జోరాగ్నిభయము శిఖి... 194

కుక్కలు గ్రామమునకు ఆగ్నేయదిశను సూర్యుని చూచుచు, 2, 3 రోజులు మొరుగునెడల చోరాగ్నిభయము కలుగునని గ్రహింపవలయును.

క. అలాగే మధ్యాహ్నము, వాలాయము మొరిగనేని పడుమృత్యువుచే, నాలాగపరాహ్ణంబున, శీలంబుగ మొరుగ కలత శిఖి... 195

అదేప్రకారము మధ్యాహ్నకాలమునందు మొరుగునేని మృత్యుభయము. అపరాహ్ణకాలమునందు మొరుగునెడల కలహము కలుగును.

క. సందెకడ నినుని కభిముఖు, మొందుచు శునకంబు లేడ్వ నొనగూడును కా,ప్రుందనములు బహునష్టము, చెందెద రనయంబు నిజము శిఖి... 196

సాయంకాలమునందు సూర్యాభిముఖములై కుక్క లేడ్చునెడల ఆగ్రామస్థులకు ధననష్టము కలుగును.

క. సందెకడ నగ్నిదిశనా, క్రందనములు చేయుచున్న గ్రామంబునకుఁగా, తొందరగ దొంగలొత్తురు, చిందసుదర్శనధురీణ శిఖి... 197

సాయంకాలమునందు ఆగ్నేయదిక్కునందు కుక్కలు ఏడ్చుచున్నను ఆగ్రామమునకు దొంగలు వచ్చెదరు.

క. ఏయింటిముందు కుక్కలు, పాయక తలవంచి
నేల బరుకుచు నేడ్వఁగ, ఆయింటిబిడ్డలకు మృతి,
చేయుఁగ తప్పదిది నిజము శిఖి... 198

ఇంటి ముందుగ కుక్కలు తలవంచి నేలబరుకుచు ఏడ్చు
నెడల ఆయింటియందుండుబిడ్డలకు చేటుకలుగును.

క. ఏవీథిలోనఁ గుక్కలు, ఆవని శోకింపనెన్మిదహ
ములలోనఁగ, పోవును పీనుంగొక్కటి, సేవకసేవధి
రమేశ శిఖి... 199

ఏవీథిలోగాని కుక్కలు ఏడ్చుచున్నయెడల 8 రోజులలో
ఆవీథియందు తప్పక మరణ మొకటి కలుగును.

క. మిన్నుఁగని కుక్కలేడ్చిన, పన్నుగవర్షంబు
నింటిపై నేడ్చినలో, నున్నమనుజులకు భయమగు,
చిన్నాబళగిరివిహార శిఖి... 200

ఆకాశము చూచి కుక్క లేడ్చినయెడల వర్షము కురియును.
ఇంటిపై నెక్కి యేడ్చిన ఆ యింటియందున్న మనుష్యులకు
భయము కలుగును.

క. గోపురముపైన నేడ్చినఁ, బ్రాపించును గ్రామ
మందు బహురోగంబుల్, గోపృథివియందు నేడ్చిన,
శ్రీపతి పశుహానియగును శిఖి... 201

గోపురము మీఁదనెక్కి కుక్కలు ఏడ్చినయెడల గ్రామ
ములో పీడలు పుట్టును. పశువులు సంచరించుభూమిలో నేడ్చిన
యెడల పశువులకు చెరుపుకల్గును.

క. మిద్దెల వాముల గూర్చొని, రద్దిగ నేడ్చిన

ను వాన రయమున వచ్చునా, వద్దనుచు మొత్తుకు
న్నను, సిద్ధము వర్షంబు గురియు శిఖి... 202

మిద్దెలమీఁదను, వాములమీఁదను కుక్కలు కూర్చుండి ఏడ్చినయెడల అమితమైన వర్షము కల్గును.

క. ఎద్దడిన కుక్కలఱచుచు, పెద్దగఁ గ్రుంకులిడి
తలలు విదిలించినచో, వద్దుగ వానలు గురియును,
సిద్ధము పదిరెండో దినము శిఖి... 203

ఎద్దడిగా నున్నకాలమునందు కుక్కలు అఱచుచు నీళ్ల యందు మునిగి తలలు విదిలించినయెడల వర్షము కురియును.

క. కాటివఱ కూరినుండియు, పాటిగ శునకంబు
లేడ్చి పరుగెత్తినచో, మేటయిన గొప్పమనిషికి,
చేటగు మరణంబుజెందు శిఖి... 204

గ్రామమునుండి శ్మశానమువఱకు ఏడ్చుచుకుక్కలుపరుగెత్తు నెడల గ్రామములో తలవంటివాఁడగుగొప్పవాఁడు మరణించును.

క. వాకిటిపై తలమోపుచు, తోకను వీథికిని
జాచి తోడ్తో నేడ్వగా, వీకమెయి నింటివారికి,
చేకొనురోగములు మిగుల శిఖి... 205

కుక్క వాకిలిమీఁద తలనుమోపి తోక వీథిలోనికి చాచి వెంటవెంటగా ఏడ్చినయెడల ఆయింటివారికి రోగము కల్గును.

క. వ్రాలి తలఁ గడపపైనిడి, వాలంబింట్లోకిజాచి
వాగిన నిలుయి, ల్లాలు రహస్థిన్నతి మిండల, శీలము
కలదై చరించు శిఖి... 206

తలను గడపమీఁదపెట్టి తోకనుయింటిలోనికి చాచి కుక్క

ఏడ్చునెడల ఆ యింటియిల్లాలు దుశ్చారిణియై యుండునని గ్రహించవలయును.

క. గోడను గోళ్లను కుక్కలు, తీడుచు పెకలించి
యేడ్చితే దొంగలచే, గోడకు కన్నముబడి మరి,
చేడెలసొమ్ములు తొలంగు శిఖ... 207

కుక్కలు గోళ్లచేత గోడనుగీకుచు ఆగోడను పెకలించుచు ఏడ్చునెడల గోడకు కన్నముబడి స్త్రీలసొమ్ములు పోవును.

క. చాకుడుకుక్కొకకంటితో,శోకించుచు కూడు
దినక సొరుగుచునుండఁగ, లోకోత్తరగుణుఁడైనను,
చేకొను శోకంబు మిగుల శిఖ... 208

పెంపుడుకుక్క ఒకకంటితో నీరుగార్చుచు అన్నము తినక దుఃఖించుచున్నయెడల ఆయజమానునికి దుఃఖము కల్గును.

క. ఎడమమోకాలు మూర్కొన, కడుధనలా
భంబు కుడిన కాంతలకలహాల్, కుడితొడ మూర్కొన
శుభమగు, చెడుగెడమను కలహామగును శిఖ...

కుక్కయెడమమోకాలును మూచూచినయెడల ధనలాభము కలుగును. కుడికాలియందైన స్త్రీకలహము. కుడితొడను మూచూచినయెడల శుభము కలుగును. ఎడమతొడను మూచూచినయెడల కీడు కలుగును.

క. పయనమగువారికాలిఁగ, కుయి కుయి యని
మూర్కొనంగ కొనసాగదునా, పయనం బెవ్వారికి
భువి, చెయిజారును చేతిదుడ్డు శిఖ... 210

ప్రయాణమైపోవువారికాలిని కుక్క కుయికుయి అని యర

చుచు మూచూచునెడల ఆ ప్రయాణము కొనసాగదు. చేతి యందుండు ధనము సైతము పోవును.

క. ఊకారంబున మొఱిగిన, ప్రాకటముగ నర్థ సిద్ధి ప్రక్కను యెడమర్, ఐకారంబున మేలగు; చేకొనుఔ ననఁగ తప్పు శిఖి... 211

కుక్క "ఊ" యని ఎడమ ప్రక్కయందు మొరగినయెడల ధనలాభము కలుగును. "ఐ" యని మొరగినను మేలే. "ఔ" యని మొరగినయెడల కీడు కలుగును.

క. కాలికినడ్డంబై తన, వాలము రుద్దుచును వెనక వైపున మొరుగఁగ, లీలగసొమ్మును దొంగకు, శీలత చూపుటకు పిలుపు శిఖి... 212

కాళ్లకు అడ్డముగా వచ్చి తనతోక రుద్దుచు వెనుకవైపున మొరుగునెడల దొంగలభయము కలుగును.

క. గట్టిగ నేడ్చుచు కూఁతలు, బెట్టుచు పరుగెత్త దానివెంటనె జనిన, తట్టున హేతువు దెలుసును, చిట్టాబళగిరివిహార శిఖి... 213

తాత్పర్యము సులభము.

క. పరుపున బడుకొని యేడ్చిన, పరుపు పయిన్ బండువారు వ్యాధిగ్రస్తుల్, చిఱుతలకు పాలుగుడిపిన, స్థిరముగ సంసారవృద్ధి శిఖి... 214

కుక్క పరుపుమీఁద పడుకొని ఏడ్చునెడల ఆపరుపుమీఁద పడుకొనువారు వ్యాధిగ్రస్తు లగుదురు. తనపిల్లలకు పాలు ఇచ్చుచు కనంబడునెడల సంసారము వృద్ధియగును.

క. శ్వానసురతంబు గనుఁగొన, మానుగ మరు
నాఁడు పయన మగుమనుట సుమీ, ఆనాఁడ పయన
మాపుము, శ్రీనిలయా తెలియవలయు శిఖ... 215

శ్వానసురతమును చూచినయెడల మరునాఁడు ప్రయాణము చేయవలయును. ఆనాఁడు చేయకూడదని ఎఱుంగవలయును.

క. లాంగూల హీనశునకము, నుం గన కీడగును
నలుపునుం గనుకుక్కన్, చెంగట గన పని సఫ
లము, చెంగించును కుంటికుక్క శిఖ... 216

తోకలేని కుక్కను చూచిన కీడుకలుగును. నల్లకుక్కనుచూచినయెడల శుభము. కుంటికుక్కను చూచినయెడల మంచిదిగాదు.

నక్కలశకునము.

క. నక్కను శునకము కరచుట, గ్రక్కునఁజూచి
నను శుభము గలుగును నక్కల్, చక్కగ గూయు
టజూచిన, చిక్కును క్షేమంబు ధనము శిఖ...217

నక్కను కుక్క కరచుచుండఁగా చూచినయెడల శుభము కలుగును. నక్కలు కూయుచున్నయెడల ధనలాభము క్షేమము కలుగును.

క. వాటముగు కాటికొరవిని, నోటం గరచుకొని
యెదుటనుం గనుపడినన్, గాటమగుదుఃఖ మశు
భము, చేటును కలిగించునండ్రు శిఖ... 218

నక్క కాటిలోని కొరవిని నోట కఱచుకొని తనకెదుట గనంబడునెడల దుఃఖము కలుగును.

క. ఘోటకముల మఱిపశువుల, కూటువలాజం

బుకములకూతలు వినుచుఁ, దాటిమలమూత్రము
లనిడ, చేటుగలుగు వానికప్పుడె శిఖి... 219

గుఱ్ఱములుగాని పశువులుగాని నక్కకూతలు విని గంతులు వైచి మలమూత్రములను విడుచునెడల వానికి చేటు కల్గును.

క. హుహూహుహూటూటూ యనురవ, హాహా శ్రేయం
బు శిశిరమందున సత్యం, బోహో యీహీ యనినను,
శ్రీహృద్వల్లభ విపత్తు శిఖి... 220

శిశిరర్తువునందు 'హుహూహుహూ! టూటూ! హాహా' యని నక్కలు కూయునెడల శ్రేయస్సు కలుగును. "ఓహో! ఈహీ!" అని నక్క లరచునెడల చెరుపుకలుగును.

క. టట్టాయనికూసినచోఁ, పట్టుక పథికులను జంప
వ్యాఘ్రాదులకుఁ, గట్టి పిలుపంచు దెలుపుట, చిట్టౌ
బళగిరివిహార శిఖి... 221

"టట్టా" యని నక్కలు కూయునెడల ప్రయాణమై పోవువారికి వ్యాఘ్రాదిదుష్టమృగములవలన బాధ కలుగును.

క. కోళ్లో కీళ్లో కూళ్లో, నాళ్లో లోళ్లో యటం
చు నక్కలుగూయఁగ, పాళెములు కాలిపోవును,
శ్రీలలనా హృద్విహార శిఖి... 222

నక్కలు "కోళ్లో! కీళ్లో! కూళ్లో! నాళ్లో! లోళ్లో!" అని కూయునెడల గ్రామములకు అగ్నిభయము కల్గును.

గరుత్మంతుని శకునము.

క. కట్టిన బహుకష్టము లగు, చుట్టిన శుభఫల
ము లబ్బు సూటిగఁ దీర్పఁగ, పెట్టినబంగరుపంటయొ,
చిట్టౌబళగిరివిహార శిఖి... 223

గరుత్మంతుఁడు ప్రయాణసమయములందు కట్టినయెడల కష్టముకలుగును. చుట్టినయెడల శుభఫలములు కలుఁగును. తీర్చిన యెడల ధనలాభము కలుగును. కట్టుటయనఁగా:—ఎడమనుండి కుడివైపునకుపోవుట, చుట్టుటయనఁగా:—ప్రదక్షిణముగా తిరుగుట. తీర్చుట యనఁగా:—కుడివైపునుండి యెడమవైపునకు పోవుట.

క. కామించి మేతఁగఱచుక, స్వామీకృష్ణాయ
టన్న సకలంబునకుఁ, శ్రీమంతమైన శుభ మగు,
శ్రీమానిని హృద్విహార శిఖి... 224

గరుత్మంతుఁడు మేతను నోటిలోపెట్టుకొని "కృష్ణా" యని అరచినయెడల సకలశుభములు కలుగును.

క. ఏదిక్కునకుం దవిలిన, నాదిక్కున శుభఫ
లంబు లందును సిరులం, దేదిక్కుఁ గనుఁగొనినను,
శ్రీదయితాశుభము లబ్బు శిఖి... 225

ఏవైపున గరుడపక్షి తనకు గనంబడునో ఆదిక్కునందు సంపదలు కలుఁగునని గ్రహించవలయును.

క. నల్లయు పాలయు గరుడుఁడు, నల్లలితము
కుక్కనక్కసరినిరుగదలఁ, డల్లముగ వెనుకనుండిన,
చెల్లును త్రైలోక్యపదవి శిఖి... 226

నల్లయు, పాలపిట్టయు, గరుత్మంతుఁడు, కుక్క, నక్క ఇవి రెండువైపుల వెనుకనుండినయెడల శుభము కలుగును.

క. ధారుణి పాలయు గరుడుఁడు, కోరిక కుడి
నుండి యెడమకుం బోయినచో, తీరుపు కుడికిఁ
బోయిన, శ్రీరామా కట్టుటంద్రు శిఖి... 227

పాలపిట్టయు, గరుడపక్షియు కుడినుండి ఎడమకు పోయిన యెడల తీర్చుట యని యర్థము. ఎడమనుండి కుడివైపునకుఁ బోయినయెడల కట్టుట యని యర్థము.

క. కొండలకుఁ దీర్పు శుభమగు, కొండలకుఁ
గట్టు శుభముఁ గలిగించుమఱిన్, కొండలకు దర్శ
నంబే, చెందించును శుభఫలంబు శిఖి... 228

కొండలకు తీర్చుట మంచిని కలుగఁజేయును. కొండలకు కట్టుట శుభమును కలుగఁజేయును. కొండలకు దర్శనము శుభమును కలుగఁజేయును.

క. నరులకు ప్రత్యూదయము ని, ద్దుర మేల్కొని
కనులు దెరువఁ దోడ్తో గరుడుం, డురువడి దర్శన మి
చ్చిన, చిరశుభమాయురభయంబు శిఖి... 229

ఉదయకాలమునందు నిద్ర మేల్కొని కనులు తెఱచుచుండఁగనే గరుడపక్షియే ప్రథమమునఁ గనఁబడునెడల శుభములు కలుగును.

క. నీరాకరముల చెంగట, గారుడశకునంబుఫల
ముగా దెవ్వేళన్, నీరాభావం బగు దిశ, శ్రీరమణా
కలుగు శుభము శిఖి... 230

పాలపక్షిశకునము.

క. పప్పన్నము పైమాటయు, తప్పక పసిలాభ
మొదవు ధరమనుజులకున్, యొప్పైన పాలశకున
ము, చెప్పఁగవలెనా ఫలంబు శిఖి... 231

పాలపక్షి గనంబడునెడల మృష్టాన్నభోజనము ధనలాభము కలుగును.

క. సురపతిచే బహుచేటగు, నరయఁగ నాగ్నే
యమునను నతికష్టమగుఁ, ధర సామ్రాజ్యము శుభ
ములు, సిరు లలరును యమునిమీఁద శిఖి... 232

క. నైరృతిని వాహనంబులు, కోరిన లక్ష్మీకరం
బగుఁ వరుణునిపై, చారుతరకీర్తిశుభములు, చేరును
వాయవ్యమూల శిఖి... 233

క. ధనపతిపై మరణంబగు, ఘనమగు నీశాన్య
మూల కడుదుఃఖమగుఁ, కను పాలపక్షి శకునము,
చిన యోబళగిరివిహార శిఖి... 234

తూర్పుదిశయందు పాలపిట్ట గనంబడిన చెరుపు కల్గును. ఆగ్నేయదిక్కునందు అతికష్టము కలఁగును. దక్షిణదిక్కునందున లాభము కలుగును. నైరృతిదిక్కునందు వాహనములు లభించును. పశ్చిమమున సత్కీర్తి కలఁగును. వాయవ్యమున శుభము కలఁగును. ఉత్తరపుదిక్కునందు మరణము కలుగును. ఈశాన్యదిక్కునందు కష్టములు కలుగును.

క. వలపలనుండిన నెమ్మది, వలపలనుం డెడమజనిన
బడయుఁ శుభముల్, నెలనడుమను గన లాభము,
చెలువెడలును కుడికి జనిన శిఖి... 235

కుడివైపుననున్న మంచిది. కుడినుండి యెడమవైపునకుఁ బోయినను శుభములు కలుగును. ఎడమనుండి కుడివైపునకు పోయిన చెరుపు కలఁగును.

క. తనముంగల గనలాభము, తన వెనుకను గనిన
కీడు తప్పదు జనులకుఁ, ఘనపాలశకునమందును, చిన

యోంబళగిరివిహార శిఖ... 236

తనకు ముందుగా పాలపత్తి గనంబడినయెడల లాభము కలుగును. తనకు వెనుకభాగమునందుఁగనంబడినయెడలచెరుపుకలుగును.

## కాకులశకునము.

క. ఒక్కటితీర్చిన నిర్భయ, మక్కట శుభఫలము
రెండు నటచీర్పంగన్, నిక్కముగ మూఁడు దీర్చిన,
చిక్కును నొకరాజ్యలక్ష్మి శిఖ... 237

ఒకకాకి తీర్చినయెడల మంచిది. రెండుతీర్చిన శుభఫలము కలుగును. మూఁడుకాకులు తీర్చినయెడల రాజ్యలాభముకల్గును.

క. తీరిచికట్టినమరణము, తీరక మున్గట్టనేనిదీన
తగను విస్తారము కట్టిన దీర్చిన, శ్రీరమణా కార్యసిద్ధి
శిఖ... 238

తీరిచికట్టినయెడల మరణము కలుగును. తీరచకయే కట్టిన యెడల దైన్యము కలుగును. పలుసారులు కట్టినను తీర్చినను కార్యసిద్ధి యగును.

క. మేతయుఁ గట్టెయుఁ గరచుక, ప్రీతిక వాయ
సముతీర్పఁ బెనులాభము నేనాతీర్చి యొకటికట్టిన,
స్ఫీతం బగుశుభముగలుగు శిఖ... 239

కాకి మేతయుం కట్టెయు ముక్కుతో కరుచుకొని తీర్చిన యెడల లాభము కలుగును. ఎక్కువ సంఖ్యగల కాకులుతీర్చి ఒకటిమాత్రము కట్టినయెడల శుభముకలుగును.

క. దండిగ సరిగా జోడై, రెండున్ మూఁడయిన
దీర్పు లేవడి యగుచున్, ఖండితముగఁ జెడుగార్య
ము, చెందున్ తలమీఁదిపనియు శిఖ... 240

జోడుకాకులు రెండుమూఁడుపర్యాయములు తీర్చినయెడల కార్యహాని యగును.

క. వెనుకను ముందై తీర్చిన, పనిలక్ష్మీకరమునగు
చు భాసిల్లును గట్టినఁ గత్తిమీఁది సాముగు, చిన
యోబళగిరివిహార శిఖి... 241

వెనుకటినుండి ముందుకువచ్చి దీర్చినయెడల కార్యము సాను కూలముగ నగును. కట్టునెడల కార్య మనుకూలమగుట కష్టము.

క. కోరినయెడ బహుదూరము,నారయ నున్నత
పు తీర్పు లాలస్యమగుఁ, జేరువ నెదురుగఁ బోడ
పున, శ్రీరమణా తీర్పుమేలు శిఖి... 242

దూరమునుండి కాకులు తీర్చునేని ఆలస్యముగ కార్యము సిద్ధించును. సమీపమునుండి ఎదురుగ తీర్చునెడల మేలుకల్గును.

క. వెనుదిక్కునుండి ముంగల,కును బోయిన
శుభము నెదురుకొనివచ్చిన పూ,నినపని తడగట్టిన
గతి, చినయోబళగిరివిహార శిఖి... 243

వెనుకనుండి ముంగలకు పోయినయెడల మేలుకలుగును. ఎదురుగ వచ్చినయెడల కార్యము చెడును.

క. ఊరను నిల్లును వెడలఁగ, భోరున దీర్చినను
మేలు భువిఁ బయినము దా, జేరు నిలునూరి ముందర,
శ్రీరమణా కట్టుమేలు శిఖి... 244

ఊరినుండిగాని ఇంటినుండిగాని బయలు వెడలునప్పుడు కాకి తీర్చునేని మేలు కలుగును. ఊరిముందరగాని ఇంటిముందఱ గాని ప్రవేశించునపుడు కట్టినయెడల మేలు కలుగును.

క. వాయసశకునం బెంచిన, బాయక గడుమా
ర్గమందుఁ బనిలేదఁసుమీ, యేయెడ నిలుపురిముం
దర, శ్రీయలరు శుభాశుభములు శిఖి... 245

కాకియొక్క శకునమునుగూర్చి మార్గమధ్యమునందు విచా రింపఁబడలేదు. ఊరిముందరను ఇంటిముందఱను మాత్రమే కాకిశకునమును పరీక్షింపవలయును.

క. వాయసమైథునమును గనఁ, జేయుఁగా పదినెల
లలోనఁ జేటును మరణం, బేయెడలనైన నరులకుఁ,
జేయగ నగు శాంతిజపము శిఖి... 246

కాకులు మైథునము చేయునప్పుడు చూచునెడల ౧౦ మాస ములలో మరణము కలుగును. కనుక తద్దోషపరిహారార్థము శాంతిని చేసికొనవలయును.

క. కాకి తనతలను తన్నిన, ప్రాకటముగ గార్య
హాని భయ మశుభంబుఁగా, కాకులుగూళ్లనుగట్టిన,
చేకొనివఱపోను నిజము శిఖి... 247

కాకి, కాళ్లతో తన్నినయెడల కార్యహాని కలుగును. కాకులు గూళ్లనుకట్టుకొన్నయెడల వర్షములు లేకపోవును.

భారద్వాజశకునము.

క. మిక్కిలి నడ్డగ పరువిడి, నిక్కఁపుఫల మబ్బు
పోతు నిజముగ దీర్పఁగా, యెక్కువ కష్టమునొంది
యుఁ,జిక్కులఁబడు మానవుండు శిఖి... 248

భారద్వాజపక్షి అడ్డముగా పరుగెత్తినయెడల మేలు కలు గును. తీర్చినయెడల కష్టములు కలుగును.

క. నాతియుఁ దీర్చినశుభమగు, నాతియు మరి పో
తుఁగూడి నయముగఁ దీర్చఁగ, ఖ్యాతిగ జయశుభ
లాభము, శ్రీతరుణీహృద్విహార శిఖి... 249

ఆడపక్షి తీర్చినయెడల మేలుఁకలుగును. ఆడపక్షియు మొగ
పక్షియు కలిసి తీర్చినయెడల జయము, శుభము కలుగును.

క. ధరలో భారద్వాజము, కరమరుదుగ పసల
పోలుగాడందురయా, సిరు లలరు పక్షిశకునము,
సిరిగల సౌఖ్యంబు లలరు శిఖి... 250

భారద్వాజపక్షి యనఁగా తెలుఁగులో "పసలపోలుగాఁడు"
అని అందురు. నల్లగానుండుపిట్ట. ఇది పశువులమీఁద కూర్చుం
డును.

కబ్బపులుగు, లేక, సరస్వతిపులుగుశకునము.

క. వాలాయము కబ్బపులుగు, నాలుగుజాము
లకుఁ బల్క నయముగ ఫలముల్, మేలగు నెనిమిది
దిక్కుల, శ్రీలోలా చూడవలయు శిఖి... 251

కబ్బపులుగు నాలుగుజాములలో ఎనిమిదిదిక్కులందు
పల్కినప్పుడు ఫలము నిరూపించి చెప్పుచున్నాఁడు:—

అష్టదిక్కులకు ఈక్రమముగ-ఫలముల గ్రహించవలయును.

క. మరణముఁ జేటుఁ బ్రియంబును, కరమరుదగు
వానభయముఁ గలుగును శుభముఁగ, గరకరి తొలి
జామున సుస్థిరమతిదిక్కరుల ఫలము శిఖి... 252

౧ యామము:—

మరణము, కష్టము, ప్రియము, వర్షము, భయము, శుభము సంతోషము కలుగును.

క. వానసిరి హెచ్చుఫల మను, మానము భూప తులశోకమరి రాడ్భయముౕ, శోణితదర్శనభీతియు, శ్రీమతయామద్వయమున శిఖి... 253

౨-వ యామము:—వర్షము, సంపదయు, అతిశయము, కార్యసాఫల్యము, అనుమానము, రాజశోకము, శత్రుభయము, రక్తదర్శనము కలుగునంతటి భీతియు కలుగును.

క. భయముౕ కలహము వానయు, దయగల చుట్టాలరాక ధనమును శుభముౕ, ప్రయమును లాభము లుల్లాసియగుౕ యామత్రయమున శిఖి.

3-వ యామము:—భయము, కలహము, వాన, బంధువుల రాక, ధనము, శుభము, ప్రయము, లాభము ఇవి కలుగును.

క. భోజన మగ్నిభయంబును, నాజియు పగవారి చేటు నతివృష్టి మహా, తేజము నష్టము కష్టము, శ్రీజయ నలుజాముఫలము శిఖి... 255

౪-వ యామము:—భోజనము, అగ్నిభయము, యుద్ధము, శత్రువులకు చేటు, అతివృష్టి, తేజస్సు, నష్టము, కష్టము, ఇవి కలుగును.

క. తనయిల్లును తనయూరును,తనతల్లియు నెరుగ

నపుడు దగకుడిబల్కన్, ధనలాభము శుభ ఫల
మగు, చినయోబళగిరివిహార శిఖి... 256

తనయింటిలోఁగాని దనయూరులోఁగాని యుండకుండు నపుడు తనతల్లి యెఱుఁగకుండునట్లు కుడిప్రక్కను కబ్బపులుగు కూసిన ధనలాభమును, శుభఫలమును గలుగును!

అదరుపాటు.

క. కుడిదిక్కు నదరశాంతం, బెడమకణత మధ్యఁ
మందు నెడనడునెత్తిన్, గడుకొను మృష్టాన్నంబును,
చెడు కుడిచెంపదరెనేని శిఖి... 257

కుడిదిక్కునందు అదరునెడల శాంతి కలుగును. ఎడమకణత యందును నడునెత్తియందును అదిరినయెడల మృష్టాన్నభోజనము కలుగును. కుడిచెంప అదరునేని చేటుకలుగును.

క. రాజికము నెడమచెంపను, రాజి యగున్
నొసలకుడిచెవాభరణంబుల్, రాజభయ మెడమ
చెవియును, శ్రీజయనిశ్చయము లివియ శిఖి...258

ఎడమచెంప అదరునెడల వ్యవహారికము మొదలగునవి తటస్థించును. నొసటియందు పడునెడల ఆవ్యవహారములకు రాజియగుట తటస్థించును. కుడిచెవియందు పడునెడల ఆభరణములు లభించును. ఎడమచెవియందు జయము కలుగును.

క. కనుకుడికొనదిగువవలన,యనముపయి న్నదర

కీడు నటుకొనదిగువన్, గనుకీడుపైన మొదలెంచిన
మే లగునెడమకన్ను శిఖి... 259

కుడికన్నుయొక్క కొనయందు దిగువ ఎల్లపుడు అదురునేని మంచికలుగును. పైని అదరునేని కీడుకలుగును.

క. కాసవరక్తముకందురు, నాసికయదరంగ రెం
డునయనములదరన్, వాని సమాఖ్యయు జగడము,
చేసును పై పెదవి యదర శిఖి... 260

ముక్కదరునేని రక్తమును కండ్లజూతురు. రెండుకండ్ల దరునెడల మంచిది. పైపెదవియదరునేని కలహము సిద్ధించును.

క. అడుగు పెదవి మృష్టాన్నము, కడులాభము
గడ్డమదరగా ధనమబ్బున్, కుడి చెక్కిలెడమ చెక్కిలి,
చెడుచోరభయంబు లండ్రు శిఖి... 261

క్రింది పెదవి యదరునేని మృష్టాన్నభోజనము కలుగును. గడ్డమదరునెడల లాభముకలుగును. కుడిచెక్కిలి అదరినయెడల ధనలాభము కలుగును. ఎడమచెక్కిలి అదరిన యెడల చోరభయము కలుగును.

క. కుడిభుజ మింతులకగు శుభ, మెడమభుజం
బదరకీడు నిలపుత్రులకౌ,కుడిప్రక్క నెడమప్రక్కన,
చెడు నగ్నిభయంబు లండ్రు శిఖి... 262

స్త్రీలకు కుడిభుజ మదరునెడల శుభము కలుగును. ఎడమ భుజ మదరునెడల పుత్త్రులకు చేటుకలుగును. కుడిప్రక్కనం

దును ఎడమప్రక్కనందును అదరినయెడల అగ్నిభయము కలుగును.

క. ఉరముఁ జేతులు మీఁచెయి, యరచెయి వాహనము ధనము నరచెయి సుతులున్, వరయూరునెడమ తొడయును, సిరిఁబడయును రాజభయము శిఖి... 263

ఉరము, చేతులు, మీఁజేయి, అరచేయి, అదరునెడల వాహనప్రాప్తి ధనప్రాప్తి కలుగును. అరచేయిమాత్రము అదరినయెడల పుత్రులు కలుగుదురు. కుడితొడయు ఎడమతొడయును అదరినయెడల సంపదలు, రాజభయము కలుగును.

క. మోకాళ్లనడుమ జాడ్యము, గైకొను నాభరణ మొట్టికాళ్లదిరినచో, పైకాళ్ల ధాన్యలాభము, చేకొను నరికాళ్ల శుభము శిఖి... 264

మోకాళ్ళనడుమ నదరినయెడల రోగము కలుగును. కాళ్లమాత్రము అదరినయెడల ఆభరణ ప్రాప్తి యగును. పైకాళ్లయందు అదరినయెడల ధాన్యలాభము. అరికాళ్ళదరునెడల శుభము కలుగును.

## వైద్యవిషయశకునములు.

క. ఏయెడవైద్యునిఁ బిలువఁగ, పోయెడు వారలకు మంచిపొలుపగు శకునం, బాయతగతిఁ గలిగినచో, శ్రీయుత యారోగ్యమబ్బు శిఖి... 265

వైద్యునిపిలుచుకొని వచ్చెడినిమిత్తము పోవువారికి త్రోవలో

మంచిశకునము కలిగినయెడల రోగికి ఆరోగ్యము కలుగును.

క. రోగికడ కేగువైద్యున, కోగుగ దుష్టమగు
శకున మొనఁగూడినచో, బాగు కలుగ దిలరోగికి,
శ్రీగరుడవిహంగవాహ శిఖి... 266

వైద్యుఁడు రోగిని జూచుటకు వచ్చునపుడు అతనికి దుష్ట
శకుశ మగునెడల రోగికి క్షేమముకలుగదు.

క. శునకములు రోగివాకిట, గోనకొని నఖముల
ను నేలగోకుచుఁ దుడువఁగ, చను రోగి యముని
గీముకు, చినదొంబళగిరివిహార శిఖి... 267

రోగియొక్క వాకిలియందు కుక్కలు గోళ్లతో భూమిని
గోకుచు తుడుచుచున్న యెడల ఆరోగికి త్వరలో మరణము
కలుగును.

క. ఔషధము సేయునప్పుడు, తోషము మదిలే
క చెడినఁ దోడనె వైద్యుం, డాసించక నారోగిని,
శేషశయన విడువవలయు శిఖి... 268

వైద్యుఁడు రోగినిమిత్తము మందును సిద్ధము చేయునప్పుడు
సంతోషము లేక విచారముగా నున్నయెడల ఆరోగికి ఆరో
గ్యము కలుఁగదు. కావున అట్టివానికి మందిచ్చుట మానవల
యును.

క. వేకటియగు సతిపతికిల, సోకగ తగదెట్టివ్యాధి

సోకిననిడిపై, ప్రాకగతగదదియాపద, చేకొనిమృతిఁగ
లుగఁజేయు శిఖి... 269

గర్భిణియగుస్త్రీ రోగియగు తనభర్తను చేతితోఁ దాఁకఁ గూడదు. దానివలన చెరుపు కలుగును.

క. నరులకు బలమగు రోగము, త్వరితంబుగఁ
గుదురెనేని వడిగఁ మరలఁ, దొరకొని చేటొ
నగూర్చును, చిరకాలముకైన మరల శిఖి... 270

రోగులకు ప్రబలరోగము ఔషధమును పుచ్చుకొన్నవెంటనే అతిత్వరితముగ మానిపోయినయెడల అతనికి మరల ఆరోగము త్వరలో రాఁగలదని యెఱుంగవలయును.

క. రోగి తనయుండు భార్యయు, నోగుగ నేప్రొ
ద్దు కలత లొందుచు నున్నఁ, రోగము కుదురదు
చంపును, శ్రీగౌరీవినుతపాద శిఖి... 271

రోగి వానిపుత్త్రుఁడు, భార్య, ఎల్లప్పుడు జగడమాడుచుండునెడల ఆరోగము కుదురదు.

క. ఈరోగి యింక బ్రతుకఁడు, మారక మే కలుగు
ననుచు మరిమరిజనముల్, పోరులు వాడుక చేసినఁ,
జేరును యమసదనమునకు శిఖి... 272

క. చీటికిమాటికి వైద్యుని, పాటింపక బిలుచున
ట్టివ్యాధిగ్రస్తుల్, చేటొందుట సిద్ధం బిల, చీటిఁ
బడయంగవచ్చు శిఖి... 273

క. భీషణముగ వైద్యునిపై, రోషావేశమున
రోగి రూక్షోక్తులచే, దూషించి పల్కుచుండిన,
శేషశయన రోగిచచ్చు శిఖి... 274

ఈరోగి బ్రతుకఁడు తప్పకచావఁగలఁడుఅని ఒకనాఁడు కల పుట్టించినను, నిష్కారణముగ పలుమారు వైద్యుని పిలిపించుచున్నను, వైద్యునిపైని ఎల్లప్పుడు దూషించి మాట్లాడినను చేటు కలుగును.

క. వైద్యునిపై విశ్వాసము, వైద్యుం డిడునట్టి
మందుపై విశ్వాసం, బద్యతనంబుగ కలిగిన, సిద్ధం
బారోగ్యఫలము శిఖి... 275

వైద్యునియందును, వైద్యుఁడిచ్చుమందునందును విశ్వాసము కలిగినయెడల ఆరోగ్యము కలుగును.

క. ఇలదీర్ఘరోగి కెప్పుడు, కలియంబడి కుక్కతరి
మి కరిచినయటులన్, కలఁగనియేనేని మరణము,
శిలశాసన మగుచునుండు శిఖి... 276

దీర్ఘరోగియై యుండువానికి స్వప్నమునందును, కుక్కవాని తఱిమికఱచినటుల కలవచ్చునెడల వానికి మరణము తప్పక కలుగును.

క. రోగులు స్వప్నంబులలో, నేగతి జాబులను
చదివిరేని నిజముగా, వేగముగ యమునిగాంతురు,
శ్రీగౌరీశనుతపాద శిఖి... 277

రోగులు స్వప్నములలో ఉత్తరములను చదివినటుల వచ్చునెడల త్వరలో వారికి మరణము ప్రాప్తించును.

## ప్రాణిప్రభృతిశకునములు.

క. సాలెప్పురు గోడలిమీఁదను, చేలముపైఁ
బ్రాకెనేని శీఘ్రంబుననే, చేలములు క్రొత్తవచ్చును,
శ్రీలలనాహృద్విహార శిఖి... 278

సాలెపురుగు దేహముమీఁదను గుడ్డలమీఁదను ప్రాఁకినయెడల త్వరలో క్రొత్తవస్త్రములు వచ్చును.

క. బరిణపురుగులును కప్పలు, స్థిరమగు జలపక్షి
రొదలు చీమలబారుల్, కరమురుదుగబహుళంబుగ,
సిరిమగఁడా! కాంచ వృష్టి శిఖి... 279

బరిణపురుగులు, కప్పలు, జలపక్షులధ్వనులు, చీమలబారులు తరుచుగఁ గనంబడునెడల మిక్కుటమగువృష్టి కలుగును.

క. గుడిగలయఖండ మారిన, వడి సున్నపుకుండ
నేలబడి పగిలినచో, వడివడి దొంగలువత్తురు, చెడు
గగపడుచుండు వేగ శిఖి... 280

గుడిలో ఉండు అఖండదీప మారిపోయినను, సున్నపుకుండ పడి పగిలిపోయినను దొంగలువత్తురు. చెరుపుకలుగును.

క. బాలురువాకిట గడపఁగ, ప్రేలుచు మూత్రించి
నేల వెసనలికినచో, మేలగు చుట్టాల్వత్తురు, శీలం
బుగ భుక్తివేళ శిఖి... 281

చిన్నపిల్లవాండ్రు గడపమీఁదనుండి మాట్లాడుచు మూత్రము విసర్జించి దానిని నేలమీఁద అలికినయెడల భోజనసమయమునకు చుట్టాలువత్తురు.

క. మేనునఁగలవస్త్రంబును, మ్రానటుతగులఁగొని
లాగ మ్రాన్పులియందుఁల్, తేలు నొక విశేషంబట,
శ్రీలోలా చిత్ర మిద్ది శిఖ... 232

ప్రయాణమై పోవునపుడు తాను ధరించినవస్త్రము చెట్టు నకు తగిలికొన్నయెడల అచట ఒకవింత పుట్టును.

క. బాలకులు మన్నుఁదిన్నను, చాలాధర లెక్కు
వగును సరిధాన్యముకుఁ, ఆలాగు గడ్డిఁ గరచిన,
శీలతపశువులకు హాని శిఖ... 233

పిల్లవాండ్లు మన్నును తినుసెడల సరిధాన్యములకు ధర లెక్కు వగును. గడ్డిని తిన్నయెడల పశువులకు హానికలుగును.

క. శిశుబ్రహ్మారంధ్రమందున, కొసచను సోకంగ
మాతకును సుడికలుగుఁ, వెసమాత కాలిపాంసువు,
శిశుసోకిన కడుపుశూల శిఖ... 234

పాలుత్రాగు పిల్లవాని బ్రహ్మ రంధ్రమున తల్లి యొక్క స్తనాగ్రము తగులుసెడల తల్లికి చిక్కులు కలుగును. తల్లి యొక్క కాలిదుమ్ము శిశువునకు సోకినయెడల ఉదరశూల కలుగును.

క. పాపలేనట్టి యుయ్యెల, నూపిన శిశువునకుఁ
గడుపునొప్పి జనించుఁ, పాపను గర్భిణిసోకిన,
శ్రీపతి కృశియించుపాప శిఖ... 285

పిల్లవాఁడు లేకుండ ఉన్న ఉయ్యెలను ఊపినయెడల పిల్ల వానికి కడుపులో నొప్పికలుగును. పసిపాపను గర్భిణిస్త్రీ తాకు సెడల ఆపిల్లవాఁడు కృశించిపోవును.

క. గోరుపయి తెల్లచుక్కలు, జారిన క్రాల్గంటు
లకును బహువేగముగా, కోరిన వేకటి కలుగును,
శ్రీరమణిహృదబ్జభృంగ శిఖి... 286

స్త్రీలకు గోళ్లపయిన తెల్లనిచుక్కలు గనంబడునెడల వారికి త్వరలో గర్భము కలుగును.

క. బోరగిల రోళ్లుబడుటయు, నారయ రోళ్ల
కును తూటు లడుగునబడినఁ, వారక తిరుగలి పగి
లిన, చేరుఁ గొడివిరుగకీడు శిఖి... 287

రోళ్లను బోరగిలపడవేసినను, రోళ్ల కడుగు భాగమందు రంధ్రములు పడినను, తిరుగలి పగిలినను కీడు కలుగును.

క. కుడికా లడుగున జిలగొన, వడి చుట్టాల్వత్తు
రెడమవైపున కలుగఁ, తడవుగ ప్రయాణ
మబ్బును, చెడుగి ట్లతివలకు గలుఁగ శిఖి... 288

కుడికాలుఅడుగునందు జిలకలిగినయెడల చుట్టాలువత్తురు. ఎడమ అరకాలులో జిలకలిగినయెడల ప్రయాణముకలుగును. స్త్రీలకు అగునెడల కీడు కలుఁగును.

క. ఘనకార్యాలోచనములు, పనిబడి శుభకా
ర్యములకు ప్రారంభములఁ, కనకన గాడిదకూసిన,
చినయోబళగిరిశ శుభము శిఖి... 289

పెద్దపెద్దపనులను గూర్చి ఆలోచన మొనర్చునప్పుడును, శుభకార్యములకును, ప్రారంభమునందు గాడిదకూసిన యెడల శుభమగును.

క. తనగోవు యెద్దు చిలుకయు, శునకము గుఱ్ఱం
బుఁ గనుల సొనసొననీరుఁగ, గొనకొని విడిచిన
చేటగు, చినయోబళగిరివిహార శిఖ... 290

తనపోషణమునందుండు ఎద్దు, చిలుక, కుక్క, గుఱ్ఱము, ఇవి కండ్లనుండి నీరును కార్చినయెడల కీడు కలుగును.

క. గేహంపావరణమునఁగ, గేహోపరితలమునం
దు గీమున నైనఁగ, హూహూయని గూబరచిన,
శ్రీహృదయవిహార కీడు శిఖ... 291

తనయింటి యావరణములోఁగాని, లేక యింటిపైభాగము నందుఁగాని ఇంట్లోగాని "హూ. హూ" యని గుడ్లగూబ అరచినయెడల కీడుకలుగును.

క. కాపురముండెడు నింటఁగ, యేపారగ తేనె
తెట్టె యిలబెట్టినచో, కాపురము చెడును కాలును,
శ్రీపతి యాగృహము వేగ శిఖ... 292

తాను నివసించుచున్న గృహమునందు తేనెటీగలు తెట్టెను పెట్టినయెడల సంసారమునకు చేటు కలుగును. త్వరలో ఆగృహము నిప్పులపాలగును.

క. కానగ రామునిహస్తము, శ్వానఛత్రంబు
లిండ్ల జనియించినచో, మానవలె నాగృహంబుల,
శ్రీనిలయా చేటుకలుగు శిఖ... 293

ఇండ్లలో రామునిచేతులు గాని, కుక్కగొడుగులు గాని మొలిచినయెడల ఆ యిండ్లను వదిలివేయవలయును. లేనియెడల చేటు కల్గును.

క. సున్నంబు పసుపునైనను, పన్నుగ నాయింటి
నేలపై బుడతలువే, గ్రన్నన చల్లుచునుండిన,చిన్నా
బళగిరిశ ఋణము శిఖి... 294

పిల్లవాండ్రెప్పుడు సున్నము, పసుపు నేలపైని చల్లుచునుండిన యెడల ఆగృహమునందుండువారికి ఋణబాధ కలుగును.

క. రాపుఁ గృకలాసనలికిరి, యేపున నెవరింటి
మీదిఁ కెగఁబ్రాకెడినో, ఆపురుషుఁడు మాసద్వయి,
శ్రీపతి మోసంబుజెందు శిఖి... 295

నలికిరిపాము కోడి ఎవరియింటిమీఁదికి ఎగఁబ్రాకునో ఆ యింటివానికి రెండుమాసములలో మరణము కలుగును.

క. ఎవనింట నల్లులెక్కువో, భువిలాభము తగ్గు
చుండు మూషకములు నె, క్కువయైన భోజనంబు
న, శివనుత యభివృద్ధికలుగు శిఖి... 296

నల్లులెక్కువగుచున్న ఇంటి[illegible]. ఎలుకలు ఎక్కువగుచున్నయింట భోజనమునం దభివృద్ధి [illegible]ను.

సర్ప[illegible]ములు.

క. దారుపనులంద[illegible]దు[illegible]

ARL... MEMORIAL ... V.L. ... ACC

మంచ మందలములకున్, తీరగు మేజాల్ బెంచీల్
చేరన్ ప్రతిజిహ్వాకీడు శిఖి... 297

పాదుకులకును, పీటలకును, మంచములకు, పాలకీలకు, మేజా బల్లలకు, బెంచిబల్లలకు ఎదురు నాలుకగలకొయ్యలు తగవు. (మేజాబల్ల బెంచిబల్ల మున్నగు అన్యభాషాపదములు లోకప్రసిద్ధ్యనుసారము గ్రహింపఁబడినవి.)

క. మొలగట్టిన దోవతిచెరు, గలయుచు ద్రొక్కుచును పయనమైనట్టయినన్, కలహంబుఁ గార్యహాని
యు, చెలువు సెషన్ జనులకెప్పుడు శిఖి... 293

తాను ధరించియున్న వస్త్రముయొక్క చెఱఁగును త్రొక్కుచు ప్రయాణమయినయెడల కలహము, కార్యహానియుం కలుగును.

క. పదునెనిమిది మూఁడెనిమిది, పదుమూఁడవ
దినములందు పనులెయ్యవియున్, మొదలిడఁగ
రాదు చెడునవి, చెదరున్ తీన్ తేర యనఁగ శిఖి...

౧౮, ౩, ౮, ౧౩, దినములలో ఏదియు మొదలుపెట్టఁగూడదు. అట్లుమొదలుపెట్టినయెడల ఆకార్యము నెరవేరదు.

క. ఏనిమిది పద్దమూఁడును పదు, నెనిమిదిమూఁడ్డినములెందు నెవ్వని జనియో, కొనసాగునతఁడుపనిచే,
సిన నాదినములను మేలు శిఖి... 300

౮, ౧౩, ౧౮, ౩, దినములందు జన్మించినవాఁడాదినములం దేకార్యమును చేసినను శీఘ్రఫలము నెరవేరును.

## అపశకునశాంతి.

క. ఏ కార్యము తలపెట్టిన, నాకట నపశకునమైన
నక్కార్యంబుగా, సోకక విడుచుటయే తగు, శ్రీక
రదానికది శాంతి శిఖి... 301

ఏపనినిగాని చేయఁబూనినపుడు అపశకునమైన యెడల
ఆ కార్యమును విడుచుట మంచిది.

క. అవని నేపనుల కాదిని,నపశకునం బైన వెనుక
కరిగి పదములఁ, గవ కడిగి దేవు నెంచుచు, శివను
త యత్నించు మరల శిఖి... 302

అపశకునమైన పిదప వెనుకపోయి పాదప్రక్షాళనముచేసి
దేవతాధ్యాన మొనర్పవలయును.

క. స్మృతిశ్రుతిమతముల నమ్మక, మతికినవారలకె
సఫలమగుశకునంబుల్, క్షితి లేనివారి కవి వృథ,
శ్రితశతమఖముఖ్యపాల శిఖి... 303

శాస్త్రవిశ్వాసముగలవారికే శుభశకునములు ఫలమునిచ్చును.

## తొండపాటుకు.

క. ముక్కునవ్యాధినివారణ, మక్కరమ్మృష్టాన్న
భుక్తి యగువక్షముపై, నెక్కినయెడ భూషణములు,
చిక్కును మఱి భుజములందు శిఖినరసింహా. 304

క. శిరసున భయ మగులక్ష్మి, కర మగువలస
మీఁద కడుభూషణముల్, నిరుఁజెవుల కంఠ
ఖము, సిరివరదా తొండపాటు శిఖనరసింహా. ౩౦

క. చేతులనాప్తుల కాపద, నాతియుచుట్టాలు
నము కడుపుపయిన్, ఖ్యాతిగ పిరుఁదులపైఁ
సీతాపతి లాభమంద్రు శిఖనరసింహా. ౩౦

క. తొడలన్ గాళ్లను రోగం, బెడను
దేహమందు నెపుడు ధనంబున్, గుడిపార్శ్వ
ధనహానియుఁ, జెడివచ్చును ముఖమునందు శి
సింహా. ౩౦

క. పాదమునందుల లాభము, మేదినిఁ
పాదమైన మెలగుధనములున్, ఆదిభయ మె
పదమున, శ్రీదయితా తొండపాటు శిఖనరసింహ.

శిఖనరసింహాశతకము

సంపూర్ణము.

---

చెన్నపురి : శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—

